





తలనొప్పి, జలుబులు, బెణుకులు, కండరాలనొప్పి — వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్న చోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూ కూడా దొరుకుతోంది.

అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది నొప్పులను, జలుబులను చప్పున, చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్

# అమృతాంజనం

## చప్పున పోగొడుతుంది!

AM-5981

---

# అమృతాంజన్ గ్రైప్‌మిక్స్చర్

పాప ఆరోగ్యానికి, సంతోషానికి దివ్యామృతం.

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు, విరేచనాలవంటి బాధలూ వెంటనే తగ్గిపోతాయి.

ఆకలి, జీర్ణశక్తి బాగా ఉంటాయి.

పాపాయి ఆరోగ్యం బాగుపడుతుంది.



అమృతాంజన్ లిమిటెడ్




PDS AG 1446 TEL

# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["పేదవాడి బింకం"] బూర్లె నాగేశ్వరరావు రచన.

రాజును ఎన్నిక చేసేపని ఏనుగుకు వదలటం ఈ నాడు మనకు విడ్డూరంగా ఉండవచ్చు. కాని ఏ కాలంలోనైనా మనిషి మచ్చిక చేసిన జంతువులకు సైతం ఆ కాలపు నాగరికత ఇంతో అంతో అంటుతుంది. అందుచేత ఆ కాలపు ఏనుగులు బొత్తిగా పనికి రాని వాణ్ణి రాజు చేసేవి కావని అనుకోవచ్చు. ఈ సంగతి "పట్టపుటేనుగు" అన్న కథ సూచిస్తుంది.

సంపుటి 52 మార్చి '73 సంచిక 3




సుజనో న యాతి వైరం
పరహితనిరతో వినాశకాలేపి,
ఛేదేపి చందనతరుః
సురభయతి ముఖం కుఠారస్య. 1

[సత్పురుషుడు ఇతరుల హితాన్నే కోరుతూ, తనకు వినాశం సంప్రాప్తమైనప్పుడు కూడా విరోధం పెట్టుకోడు; మంచిగంధపుచెట్టు తనను నరికిన గొడ్డలికి కూడా సువాసన కలుగజేస్తుంది.]

విసృజ్య శూర్పవ ద్దోషాన్
గుణాన్ గృహ్యంతి సాధవః;
దోషా నేవ తు గృహ్ణంతి
చాలనీ వతు దుర్జనాః. 2

[చేట చెత్తను ఎగరగొట్టి మంచిని తీసుకున్నట్టుగా మంచివాళ్ళు దోషాన్ని విసర్జించి మంచినే గ్రహిస్తారు. జల్లెడ దోషాన్ని స్వీకరించి మంచిని వదిలినట్టుగా దుష్టులు దోషాన్ని మాత్రమే గ్రహిస్తారు.]

ఖలః సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యతి,
ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి న పశ్యతి. 3

[దుష్టుడు ఇతరులలో ఆవగింజంత తప్పును కూడా చూస్తాడుగాని మారేడు కాయలంతవి తన తప్పులను చూడలేడు.]

మంచివాళ్ళు — చెడ్డవాళ్ళు



# పట్టపుటేనుగ

కొన్నివేల ఏళ్ళక్రితం సిరిపురరాజ్యాన్ని అశోకవర్మ పాలించాడు. ఆయన ఆస్థానంలో ఏటా యుద్ధ విద్యలలో పోటీలు జరిగేవి. వాటిలో హెచ్చు శక్తిసామర్థ్యాలు ప్రదర్శించిన వారిని రాజు తన కొలువులో ఉంచుకునేవాడు. అలా రాజుగారి కొలువులో ప్రవేశించి, రాజుగారి ఆదరానికి పాత్రుడైనవాడు రవివర్మ అనేవాడు.

అశోకవర్మకు సంతానం లేదు. ఆయన ఆకస్మికంగా మరణించటం వల్ల తన తరవాత ఎవరు రాజు కావలిసినదీ ఆయన చెప్పలేదు. ఆయన కొలువులో రాజు కాదగిన వాళ్ళు చాలామంది ఉన్నారు. కాని మంత్రి సుమంతుడు ఏ ఒక్కరిని గాని రాజుగా చేయటానికి భయపడ్డాడు. ఎవరు రాజైనా మిగిలినవాళ్ళు శత్రువులవుతారు.

అందుచేత మంత్రి ఈ విషయమై రాజగురువుతో సంప్రతించాడు. రాజగురువు మంత్రితో, "ఇది మీరు తేల్చవలసిన సమస్య కాదు. పట్టపుటేనుగు ఎవరి మెడలో దండ వేస్తే వారిని రాజును చెయ్యటం మనకు అనాదిగా ఉంటున్న ఆచారం. ఆ పాత పద్ధతిని ఇప్పుడు అమలు చేద్దాం," అన్నాడు.

పట్టపుటేనుగు కాబోయే రాజును ఎన్నిక చేసిందంటే ఎవరూ అభ్యంతరం చెప్పటానికి ఉండదు. అందుచేత మంత్రి రాజగురువునే ఒక మంచి ముహూర్తం చూడమన్నాడు. రాజగురువు రెండు వారాల అనంతరం మంచి ముహూర్తం ఉన్నదని చెప్పాడు. ఫలాని రోజున పట్టపుటేనుగు ఎవరి మెడలో పూలమాల వేస్తే వారు సిరిపురానికి రాజుగా అభిషేకించబడతారని మంత్రి దండోరా వేయించాడు.

ఈ చాటింపు ఒక మనిషికి తీవ్రమైన ఆశాభంగం కలిగించింది; మరొక మనిషిలో లేనిపోని దురాశ కలిగించింది.

దేశరాజు పుండరీకాక్షుడు

ఆశాభంగం పొందినవాడు రవివర్మ. అతను చనిపోయిన రాజుకు ఎంత సన్నిహితుడో కొలువులో ఉన్న ఇతరులకు తెలియదు. అశోకవర్మ తన రహస్యాలోచనలన్నీ రవివర్మతోనే చేసేవాడు. తన కన్న ముందు నుంచీ కొలువులో ఉన్న పెద్దలు అసూయ పడిపోతారని రవివర్మ రాజుగారి వద్ద ఒక చిన్న ఉద్యోగి అన్నట్టే ప్రవర్తించేవాడు. అశోకవర్మకు తాను చనిపోతానన్న అనుమానం ఏ మాత్రం కలిగినా ఆయన అనంతరం తననే రాజు చెయ్యమని మంత్రితో చెప్పి ఉండేవాడే. ఆ విషయం రవివర్మకు ఎలాటి సందేహమూ లేదు. కాని పట్టపుటేనుగుకు ఇదంతా ఏం తెలుస్తుంది? అది ఎవరి మెడలోనో దండ వేసేస్తుంది. వాడే రాజైపోతాడు. ఈ మాట తలుచుకుని రవివర్మ కుంగిపోయాడు.

లేని పోని దురాశకు గురి అయినవాడు పట్టపుటేనుగును సాకే మావటివాడు. ఎలాగైనా ఆ ఏనుగుకు తన మెడలో దండ వెయ్యటం అలవాటు చేస్తే అది రాజును ఎన్నుకునే రోజున తన మెడలోనే దండ వేస్తుందనీ, తాను రాజు కావచ్చుననీ వాడికి ఆలోచన కలిగింది. రెండువారాల వ్యవధి ఉన్నది గనక, ఈలోపుగా ఏనుగుకు తన మెడలో దండ వెయ్యటం అలవాటు చేయవచ్చునని వాడు అనుకున్నాడు.

పట్టపుటేనుగు ఉండే శాలను అనుకుని ఒక భవనం ఉన్నది. దాని ప్రహరీగోడను అనుకుని ఒక పూలతోట ఉన్నది. మావటి



వాడు ఆ గోడ దూకి, పూలు కోసుకు వచ్చి, మాలకట్టి, దాన్ని ఏనుగు తొండానికి అందించి, దానిచేత మళ్ళీమళ్ళీ తన మెడలో వేయించుకోసాగాడు.

ఇంతకూ ఏనుగుశాల పక్కన ఉన్న భవనం రవివర్మది. అతను తన పూజకూ, అలంకరణకూ తన తోటలో పూలే ఉపయోగించేవాడు. తోటలో పూలు తరిగిపోతూ ఉండటం గమనించి, దొంగ ఎవరో కని పెట్టాలని ఒక రాత్రి అతడు తోటలోనే దాక్కున్నాడు.

మావటివాడు రాత్రివేళ గోడ దూకి వచ్చి పూలు కోసుకుని, గోడ దూకి వెళ్ళిపోయాడు. రవివర్మ గోడ వద్దకు వచ్చి, మావటివాడు ఏనుగుశాలలోకి వెళ్ళటమూ, లోపల పూలతో మాల కట్టుతూ ఉండటమూ చూశాడు. వాడు ఆ మాలతో ఏం చేస్తాడో చూడటానికి అతను ప్రహరీగోడ ఎక్కి నిలబడ్డాడు.

మాల కట్టటం పూర్తి కాగానే మావటివాడు ఏనుగు తొండానికి మాల అందించి, దాన్ని ఏనుగు తన మెడలో వేసేటట్టు చేస్తున్నాడు. మావటివాడి వీపు గోడ కేసి ఉండటంచేత వాడు రవివర్మను చూడలేదు, కాని ఏనుగు చూసి, ఘీంకరించి తొండాన్ని రవివర్మ వేపు చాచింది. మావటివాడు వెనక్కుతిరిగి చూసేలోపల రవివర్మ గోడ మీది నుంచి దిగిపోయాడు. తన రహస్యం ఎవరో చూశారని వాడికి తెలిసి భయపడ్డాడు. కాని ఆ చూసిన మనిషి



ఎవరో వాడికి తెలియలేదు. తరవాత వాడు ఏనుగును తరిఫీదు చెయ్యలేకపోయాడు.

ఇంతలోనే రాజును పట్టపుటేనుగు ఎన్ను కునే రోజు వచ్చింది. ఏనుగు తొండానికి పుష్పమాలను అందించి మావటివాడు రాజ ప్రాంగణంలోకి వచ్చాడు. ఏదో వంకన మావటివాడు రెండు మూడుసార్లు ఏనుగు ముందుకు వచ్చాడుగాని, అది వాడి మెడలో మాల వెయ్యలేదు. అది ఎవరి కోసమో చూస్తున్నట్టు కనిపించింది. రవి వర్మ దాని కంటపడగానే అది గట్టిగా ఘీంకరించి, గబగబా వెళ్ళి అతని మెడలో మాల వేసింది.

రవివర్మను రాజుగా అభిషేకించారు.

తరవాత ఒకనాడు మావటివాడు ఏకాంతంలో రవివర్మను సమీపించి, "మహా రాజా, నన్ను తమరు క్షమిస్తే ఒక్క సందేహం మనవి చేసుకుంటాను," అన్నాడు.

"అడుగు," అన్నాడు రవివర్మ.

"నేను రాజు కావాలన్న దుర్బుద్ధితో పట్టపుటేనుగుకు నా మెడలో మాల వెయ్యటం అలవాటు చేశాను. కాని తీరా సమయం వచ్చేసరికి అది మాల నాకు వెయ్యక మీ కెందుకు వేసింది?" అని మావటివాడు అడిగాడు.

రవివర్మ నవ్వి, "నువు దానికి ఎన్ని విద్యలో నేర్పావు. కాని అవి నీ కోసం కాదు. నువు మాల వేసుకుని కనిపించి నప్పుడల్లా నువు మరెవరోలాగా కనిపిస్తావు. అది నీ నుంచి మాల వెయ్యటం నేర్చు కున్నదేగాని, నీ మెడలోనే మాల వెయ్యా లన్న ఆలోచన దాని మెదడులోకి రాలేదు. ఒక రాత్రి అది నీ మెడలో మాల వేయ బోతూ నన్ను చూసింది. నా మెడలో మాల ఎప్పుడూ ఉంటుంది గనక, నాకు మాల సహజమనుకుని దాని తొండానికి ఉన్న మాలను నా కేసి చాచింది. ఆ రాత్రే నీ దుర్బుద్ధి నేను గ్రహించాను. అప్పటి నుంచే నా మెడలో మాల వెయ్యాలన్న ఆలోచన దాని మనసులో ఉండి ఉంటుంది. రాజు ఎన్నికనాడు ఆ పని చేసింది," అన్నాడు.






# చీకట్లో విందు

ఇరాక్‌లోని ఒక నగరంలో మహమ్మద్, జరీనా అనే పేదదంపతు లుండేవారు. జరీనా తొలిచూలు గర్భవతిగా ఉండి, తనకు హల్వా తినాలని ఉన్నట్టు చెప్పింది.

తిండికే గతిలేని మహమ్మద్ తన భార్యకు హల్వా ఎలా కొనిపెట్టగలడు? కాని పడుచు భార్య, అందులోనూ వేవిళ్ల మనిషి, అడగక అడగక హల్వా తినాలని ఉన్నదంటే తిని పించకుండా ఉండటం ఎలా? ఏదో ఒక ఉపాయం చేసి తన భార్యచేత హల్వా తిని పించాలని మహమ్మద్ నిశ్చయించాడు.

అంతకు ముందే వర్షం పడింది. వర్తకులు బూజు పట్టే తమ సరుకులను వీధుల్లో ఎండ బెట్టారు. ఒక బజారులో శనగపిండి ఆరబోసి ఉన్నది. అది చూసి మహమ్మద్ ఇంటికి వెళ్ళి ఒంటికి బాగా నూనె పట్టించి, ఆ బజారు వెంబడి నడుస్తూ, కావాలని శనగపిండి మీద తూలిపడి, పొర్లి, ఒంటి నిండా ఇంత మందాన శనగపిండి అంటించుకుని, గబగబా ఇంటికి తిరిగి వచ్చి, తన ఒంటికి అంటిన శనగపిండి అంతా చేటలో దులిపి, స్నానం చేశాడు.

తరవాత అతను ఒక పెద్ద తలపాగా తలకు అనీ అనకుండా పెట్టుకుని, దుస్తులు వేసుకుని ఒక పెద్ద నూనె దుకాణానికి వెళ్ళి, "నూనె ధర ఎలా ఉన్నది?" అంటూ నూనె గుండిగ మీదికి వంగాడు.

తలపాగా నూనె గుండిగలో పడిపోయింది. పొరపాటు జరిగి పోయినటు, "ఎంత పని జరిగింది! ఛీ, ఛీ!" అంటూ మహమ్మద్ దుకాణం వాడికి క్షమాపణ చెప్పుకుని, తల పాగాను ఇంటికి తెచ్చి, దానిలో ఇంకిన నూనె అంతా పళ్లెంలోకి పిండాడు.

హల్వా తయారు చెయ్యటానికి కావలిసిన పిండీ, నూనె దొరికాయి. ఇక బెల్లమూ, కట్టెలూ కావాలి.

షా నవాజ్ బేగం

మహమ్మద్ మళ్ళీ దుస్తులు మార్చుకుని, బెల్లం వర్తకుల దుకాణాలకు వెళ్ళి, "మా యజమానికి బండీడు బెల్లం కావాలిట. మీ దగ్గిర ఉండే మంచి సరుకు నమూనాగా ఇయ్యండి," అని అడిగి ఒక్కొక్కని దగ్గిరా ఒక్కొక్క బెల్లపు అచ్చు తెచ్చాడు. తరవాత అతను తనకు కావలిసిన బెల్లం మాత్రం ఉంచుకుని, మిగతాది అమ్మి, ఆ డబ్బుతో కట్టెలు కొన్నాడు.

హల్వా తయారయే సరికి బాగా చీకటి పడింది. దాన్ని భార్యా భర్తలిద్దరూ తిందామనుకున్నారు. దీపం వెలిగిస్తే ఎవరైనా వచ్చి, వాళ్ళు హల్వా తింటూ ఉండటం చూసి ప్రశ్నలు వేస్తారని, కటిక చీకటిలో హల్వా పళ్ళెం మధ్య పెట్టుకుని ఇద్దరూ తినటం ప్రారంభించారు.

ఈలోపుగా వారి ఇంటికి వలీ అనే దూరపు బంధువు వచ్చాడు. ఇల్లంతా చీకటిగా ఉన్నది గాని మాటలు వినిపిస్తున్నాయి. త్వరలోనే ఆయన సంగతంతా గ్రహించి, చప్పుడు చెయ్యకుండా తాను కూడా పళ్ళెం పక్కన కూర్చుని, వారితోపాటు తాను కూడా హల్వా తినసాగాడు.

తినేటప్పుడు పళ్ళెంలో చేతులు తగులుతున్నా అవి తమ చేతులేనని భార్యా భర్తలు అనుకున్నారు.

అనుకున్న దానికన్న హల్వా త్వరగా అయిపోయింది.

"అప్పుడే హల్వా అంతా ఎలా అయిపోయిందీ? నేను తిన్నది కొంచెమేనే?" అన్నది జరీనా.

"నేను కూడా కొంచెమే తిని, ఎక్కువ భాగం నీకే వదిలాను," అన్నాడు మహమ్మద్.

"మీతో బాటు నేను కూడా తిన్నాలెండర్రా!" అన్నాడు వలీ.

దీపం వెలిగించాక ఆ భార్యా భర్తలు వలీని చూశారు.

తన భార్య చేత హల్వా తినిపించటానికి మహమ్మద్ పడినపాట్లన్నీ విని జాలిపడి, వలీ డబ్బిచ్చి మహమ్మద్ చేత జరీనా తినగోరిన సరుకులన్నీ బజారు నుంచి తెప్పించాడు.





# యక్షపర్వతం

## 10

[ఖడ్గ జీవదత్తులు, వృద్ధపూజారిని ఖైదు నుంచి విడిపించి, శిథిలభవన ప్రాంతాల నుంచి బయలుదేరారు. దారిలో వారికి పూజారిణి ఎదురుపడింది. ఆమెను ఖడ్గవర్మ బాణంతో కొట్టాడు. తరవాత వాళ్ళు మాంత్రిక జడలభూతాల వెంట అరణ్యం చేరారు. అక్కడ వాళ్ళకు కొండ మీది నుంచి ఒంటె ఒకటి కింద పడటం కనిపించింది. తరవాత—]

ఒంటె కొండ మీది నుంచి పడిపోవటం చూస్తూనే ఖడ్గ జీవదత్తులు అటు కేసి పరిగెత్తారు. వాళ్ళు వెళ్ళేసరికి ఒంటె కాళ్ళు విరిగి గిలగిల తన్నుకుంటూ నేల మీద పొర్లుతున్నది. దానితోపాటు కింద పడిన వాడు మాత్రం మోకాలును రెండు చేతులతో పట్టుకుని పళ్ళు బిగువున బాధను సహిస్తూ, చిన్నగా మూలుగుతున్నాడు. వాడు బందిపోటు ముఠాలోని వాడని, వాడి దుస్తుల తీరు చూసి ఖడ్గ జీవదత్తులు పోల్చుకున్నారు.

జీవదత్తుడు, బందిపోటు వాణ్ణి సమీపించి, "ఒరే, బందిపోటు బాబూ! నీ దెలాంటి మొండి ప్రాణం! అంత ఎత్తు కొండ మీది నుంచి పడి ఒంటె కాళ్ళువిరిగి చావుబతుకుల మధ్య ఉన్నది గాని, నువ్వు మాత్రం చెక్కు చెదరక పిడిరాయిలా వున్నావు!" అన్నాడు.



ఖడ్గవర్మ కత్తి దూసి, దాని మొనను బందిపోటు వాడి గుండెల మీద పెట్టి, "ఒరే, యిప్పుడు నిజం చెప్పు. లేకపోతే యీ ఒంటెతోపాటు నువ్వూ ఏ నక్కలకో ఆహారం అయిపోతావు. ఖడ్గజాతివాళ్ళ పంట పొలాలు దోచుకున్న బందిపోట్ల మందలో నువ్వు లేకపోతే, ఆ సంగతి దోచుకున్న నీ మిత్రుల ద్వారా విని వుంటావు. కనక నీ మాటలు నమ్మదగినవే! కాని, మమ్మల్ని చూస్తూనే, ఆ ఖడ్గజాతివాళ్ళ తరఫు మనుషులని నువ్వెలా గుర్తించావు?" అని అడిగాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు కత్తిని ఒరలో పెట్టమని చెప్పి, "ఖడ్గా, అసలే ప్రాణ భయంతో చస్తున్న వాణ్ణి యింకా ఎందుకు హడల కొడతావు? పైగా ఆ ఖడ్గజాతివాళ్లూ, ఆ పంటపొలాల దోపిడీ....అదంతా ఏనాటి మాట!" అని బందిపోటు వాడితో, "ఒరే, నా మిత్రుడడిగిన ఆఖరి ప్రశ్న అడుగు తున్నాను; మమ్మల్నెలా గుర్తించావు?" అన్నాడు.

"అయ్యా, మిమ్మల్ని అరణ్యంలో చూసిన నా మిత్రుల ద్వారా మీ వస్త్ర ధారణా, పట్టిన ఆయుధాల సంగతీ విని, యిప్పుడు మిమ్మల్ని చూస్తూనే గుర్తిం చాను. ఇందులో అబద్ధం లేదు," అన్నాడు బందిపోటువాడు.

అంతవరకూ బందిపోటు వాడు తన మోకాలు బెణికిన బాధలో వుండి, ఖడ్గ జీవదత్తులు తనను సమీపించటం చూడ లేదు. ఇప్పుడు వాడు తల ఎత్తి ఖడ్గ జీవ దత్తుల్ని చూస్తూనే కళ్ళింత చేసి వణికి పోతూ, "అయ్యా, నన్ను చంపకండి! ఖడ్గజాతివాళ్ళ పంట పొలాలు దోచిన వాళ్ళల్లో నేను లేను. నిజానిజాలు స్వర్ణా చార్యులుగారి నడిగి మీరు తెలుసుకో వచ్చు," అన్నాడు.

వాడి మాటలు వింటూనే ఖడ్గ జీవదత్తులు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళకు స్వర్ణాచారి సజీవుడేననీ, అతను బందిపోట్ల దగ్గిరే వున్నాడనీ తెలిసిపోయింది.

"ఆహాఁ, నువు బుద్ధికి బృహస్పతివి! ఎక్కడైనా గురుకులం పెట్టి శిష్యులకు విద్యాబోధ చెయ్యక, యీ దారి దోపిడి ముఠాలో ఎందుకు చేరావు?" అంటూ ఖడ్గ వర్మ పెద్దగా నవ్వి, "ఆ రాయీ రప్పలూ ఒంటెల చేత కొండ మీద లాగించుకు పోతున్నారే, అవి ఎందుకు? ఎక్కడికి?" అని అడిగాడు.

"అయ్యా, స్వర్ణాచార్యులవారు మా నాయ కుడు స్థాపించబోయే రాజ్యానికి రాజధానీ నగరం, పెద్ద కోటా కట్టబోతున్నారు. వారి అజ్ఞ ప్రకారం మేమంతా కొండరాళ్ళు లోయ పైనున్న ఒక సమతల ప్రదేశానికి చేర్చుతున్నాం," అన్నాడు బందిపోటు వాడు మూలుగుతూ.

ఖడ్గ జీవదత్తులు కాలు బెణికిన బంది పోటు వాడితో మాట్లాడుతూ కొండ మీద ఏం జరుగుతున్నదో చూడలేదు. అక్కడ బంది పోటు వాడి స్నేహితులు, ఒంటెతోపాటు తమ వాడు కింద పడటం చూస్తూనే, తమ తమ ఒంటెలను ఆపి, కొండ అంచుకు వచ్చి, దిగువకు చూశారు. వాళ్ళకు యింకా ప్రాణాలతో వున్న తమ తోటివాణ్ణి సమీపిస్తూ, ఖడ్గ జీవదత్తులు కనిపించారు.

వాళ్ళను చూస్తూనే బందిపోటు వాళ్ళు అదురుకు పోయారు. వాళ్ళల్లో కొందరికి అరణ్యంలో ఖడ్గ జీవదత్తులు తమ నెదు



ర్కొని బాణాల దెబ్బలతో, కత్తి పోట్లతో చీకాకుపరిచి పారదోలటం యింకా గుర్తు న్నది. ఒకరిద్దరు ఖడ్గ జీవదత్తులు మాంత్రి కుణ్ణీ, జడలభూతాన్నీ అదరగొట్టి గుహలో జొరబడటం కూడా చూశారు.

"మన నాయకుడిక్కడలేడు. ఆ క్షత్రియ యువకులు మనను చూశారు. వాళ్ళు కొండ పైకి వచ్చి మన ప్రాణాలు తీయటం ఖాయం!" అన్నాడొక బందిపోటు.

"రానున్న అపద నుంచి మనం బయట పడాలంటే, యిప్పుడే పోయి స్వర్ణాచార్యులు గారితో సంగతంతా చెప్పుకుని, వారు ఏమి చేయమంటారో అలా చేయటం ఒక్కటే మార్గం. అయినా, యీ క్షత్రియయువకులూ



లోగడ మిత్రులన్న సంగతి మనం ఎరిగిందే గదా!'' అన్నాడు మరొక బందిపోటు.

ఆ వెంటనే పదీ పన్నెండుమంది బందిపోట్లు పరుగు పరుగున స్వర్ణాచారి దగ్గిరకు పోయారు. ఆ సమయంలో స్వర్ణాచారి ఒక ఎత్తయిన రాతి మీద కూర్చుని, తాను బందిపోటు నాయకుడికి కట్టనున్న కోటకు సంబంధించిన వాస్తుపటం పరిశీలిస్తున్నాడు.

బందిపోట్లు దగ్గిరకు రావటం చూస్తూనే స్వర్ణాచారి పటం మీది నుంచి దృష్టి వాళ్ళ మీదికి తిప్పి కోపంగా, ''పని మాని అందరూ కట్టకట్టుకుని ఏదో రాక్షసుడి బారి నుంచి పారిపోయి వస్తున్నట్టు యిక్కడికి పరిగెత్తుకొస్తున్నారేం? వేటకు పోయిన మీ నాయకుణ్ణి తిరిగి రానివ్వండి. మీ తాట ఒలిపిస్తాను,'' అన్నాడు.

బందిపోట్లలో ఒకడు వణుకుతున్న గొంతుతో, ''అయ్యా, స్వర్ణాచార్యులుగారూ! మా నాయకుడు యిక్కడ లేని సమయాల్లో మీరేగదా మాకు నాయకులు! మన ఒంటె ఒకటి పైనున్నవాడితో పాటు కాలుజారి కొండ కింది పల్లంలోకి పడిపోయింది. అది చూస్తూనే దారేపోయే మీ పాత మిత్రులైన క్షత్రియ యువకులిద్దరూ, కత్తులూ, బాణాలూ తీసుకుని యింకా ప్రాణాలతో వున్న మనవాడి దగ్గిరకు వచ్చి ఏవో ప్రశ్నలడుగుతున్నారు. వాడి ద్వారా మనం వున్న చోటు తెలుసుకుని, ఆ ఇద్దరూ మనను హతం చేయటానికి త్వరలోనే యిక్కడికి వస్తారని, మాకు భయంగా వుంది,'' అన్నాడు.

క్షత్రియ యువకులు అన్న మాట వింటూనే స్వర్ణాచారి అదిరిపడి ఆ మరుక్షణానే సంతోషం పట్టలేక, రాతి మీది నుంచి లేచి నిలబడ్డాడు. బందిపోటు వాడు చెప్పిన తతిమ్మా సంగతులు విన్న తర్వాత, అతడికి తన మిత్రులిద్దరూ అక్కడికి వచ్చారన్న దాంట్లో ఎలాంటి అనుమానం లేకుండా పోయింది.

స్వర్ణాచారి కొండ అంచుకేసి బయలుదేరుతూ, ''ఒరే, ఒంటెవాడా! క్షత్రియ

యువక యోధులు యిక్కడికి వచ్చారని ఒక మాటలో చెపితే సరిపోయేదానికి, ఎంత గ్రంథం పెంచి మాట్లాడావురా? ఇక నోరు మూసుకుని, నా వెంట రా!'' అన్నాడు.

"ఆచార్యులుగారూ! అలాగే వస్తాం. వారి వల్ల మాకేం ప్రాణహాని జరగదు గదా?'' అన్నారు బందిపోట్లు.

"అలాంటి దేమీ వుండదు. మీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డువేస్తాను. మీరు మాత్రం ముచ్చువేషాలు వేయక వాళ్ళతో మర్యాదగా ప్రవర్తించండి,'' అన్నాడు స్వర్ణాచారి.

స్వర్ణాచారి కొండ అంచుకు వచ్చి ఖడ్గ జీవదత్తుల్ని పెద్ద కేక వేసి పిలిచాడు. ఆ కేక వింటూనే ఖడ్గ జీవదత్తులు తలలు ఎత్తి చూసి స్వర్ణాచారిని గుర్తించారు. అతడి వెనకగా కొందరు బందిపోట్లు నిలబడి వుండటం చూసి ఖడ్గవర్మ, "జీవా, ఈ పద్మపుర వాస్తుశాస్త్రజ్ఞుడూ, మర ఏనుగుల్ని తయారు చేసే యీ స్వర్ణాచారి బందిపోట్ల ముఠాలో ఒకడైపోయాడేమో అని నాకు అనుమానం కలుగుతున్నది. మన జాగ్రత్తలో మనం వుండాలి,'' అన్నాడు.

ఖడ్గవర్మ యిలాంటి అనుమానాన్ని వెల్లడించిన తరవాత జీవదత్తుడికూడా కొంచెం సంశయం కలిగింది. స్వర్ణాచారిని బలవంతంగా బందిపోట్లు ఎత్తుకు వచ్చినా, ఆ తరవాత అతడు వాళ్ళతో స్నేహం కలిపినా కలిపి వుండవచ్చు....





"ఖడ్గా, మనం వింధ్యపర్వతాలు చేరే వరకూ అన్ని వేళలా మన జాగ్రత్తలో మనం వుండవలసిందే, సందేహం లేదు. మనం యిటు వచ్చింది స్వర్ణాచారిని బందిపోట్ల నుంచి బంధ విముక్తి చేయటానికి గదా? చూద్దాం, మనిషి ధోరణి ఎలా వుందో!" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గ జీవదత్తులు యిలా మాట్లాడు కుంటున్నంతలో స్వర్ణాచారి నలుగురు బందిపోట్లను వెంటబెట్టుకుని వాళ్ళ దగ్గిరకు వచ్చి ఎంతో భక్తితో నమస్కరించాడు. అతడి వెంట వున్న బందిపోట్లు నలుగురూ ఖడ్గ జీవదత్తులకు సాష్టాంగ పడి, లేచి నిలబడ్డారు.

జీవదత్తుడు నవ్వుతూ, స్వర్ణాచారి భుజం తట్టి, "స్వర్ణాచారీ, ఎలా వున్నావు? బందిపోట్ల నాయకుడికి మాయఏనుగుల్నీ, గుర్రాలనూ ఏమైనా తయారు చేస్తున్నావా? నువ్వు వీళ్ళ చేతుల్లో చాలా కష్టాలను భవిస్తూంటావని అనుకున్నాం. చూడగా నువ్వు కూడా బందిపోట్లకు ఒక చిన్న నాయకుడివైపోయినట్టుంది!" అన్నాడు.

ఆ మాటలకు స్వర్ణాచారి ఒక్క క్షణకాలం నిశ్చేష్టుడైపోయి, చేతులు రెండూ జోడించి, "మీరొకసారి నాకు ప్రాణదానం చేశారు. మీకు జీవిత కాలమంతా కృతజ్ఞుడనై వుంటాను. నేను తప్పనిసరై బందిపోట్ల నాయకుడికి కోట కట్టి పెడుతున్నాను. అది పూర్తి కాగానే నా దారిన నేను పోయి విఘ్నేశ్వరపూజారిని కలుసుకుని, తరవాత యిద్దరం ఏ అరణ్యంలోనో తపస్సు చేసుకుంటాం," అన్నాడు.

"విఘ్నేశ్వరపూజారి, ఖడ్గజాతి వాళ్ళ అరణ్యపుర ప్రాంతాల్లోనే సుఖంగా వున్నాడు. నువ్విక్కడ సుఖంగా వున్నావు గదా? ఇక మా దారిన మేం పోతాం," అన్నాడు జీవదత్తుడు.

ఆ జవాబుకు స్వర్ణాచారి గడబిడపడి పోతూ, "ఖడ్గ జీవదత్త ప్రభువులు ఒక రోజైనా నా ఆతిథ్యం స్వీకరించకుండా వెళ్ళటమా? అది కుదరదు. మీరు

యీ పగలూ, రాత్రీ నాకూ, సమరబాహు డికీ అతిథులుగా వుండాలి," అన్నాడు.

"ఎవరా సమరబాహు?" అన్నాడు జీవ దత్తుడు ఆశ్చర్యపోతూ.

"ఓహెూ, మీరు లోగడ బందిపోట్ల నాయకుడి పేరు వినలేదన్నమాట? సింధు ఎడారుల నుంచి ఒంటెల మీద యీ ప్రాంతా లకు వచ్చిన, యీ బందిపోట్ల నాయకుడి పేరది. ఇప్పుడతడు ఇంటి దగ్గిర లేడు, వేటకై ఇద్దరు అనుచరులతో కలిసి అర ణ్యానికి వెళ్ళాడు. ఇక వెళదాం, రండి!" అంటూ ముందుండి దారి తీశాడు స్వర్ణాచారి.

ఖడ్గ జీవదత్తులు బయలుదేరుతూ, ఒంటెతో పాటు కింద పడి గాయపడిన బందిపోటు వాణ్ణి, వాడి అనుచరులకు చూపి, "వీణ్ణి మీరు భుజాల మీద మోసుకుపోవలసిందే!" అన్నారు.

ఆ వెంటనే ఇద్దరు బందిపోట్లు గాయ పడిన వాణ్ణి భుజాలకెత్తుకున్నారు. అందరూ కలిసి కొద్ది సేపటికల్లా కొండ మీద వున్న బందిపోట్ల నివాస స్థానాలు చేరేసరికి, అక్కడ ఎలుగుబంటి చర్మాలు ధరించిన ఒకడి చుట్టూ కొందరు బందిపోట్లు చేరి గొడవగొడవగా మాట్లాడుతున్నారు. ఖడ్గ జీవదత్తుల్నీ, స్వర్ణాచారినీ అంత దూరాన చూస్తూనే, అందరూ పరిగెత్తుతూ వాళ్ళ దగ్గిరకు వచ్చారు.



"ఈ గొడవంతా ఏమిటి? నువ్వు యీ ఎలుగుబంటి వేషం వేసి తైతక్క లాడుతున్నావెందుకు?" అని స్వర్ణాచారి వాణ్ణి గట్టిగా కోప్పడ్డాడు.

ఎలుగుబంటి చర్మాలు కట్టుకున్నవాడు స్వర్ణాచారికి వంగి నమస్కారం చేసి, "స్వర్ణాచార్లుగారూ, ఈ చర్మాలు నేను కావాలని కట్టుకున్నవి కావు. నేను యివ్వాళ ఉదయం నాయకుడితో వేటకై అరణ్యం లోకి వెళ్ళిన యిద్దరిలో ఒకణ్ణి. నాయకుణ్ణి అక్కడ ఎవరో బహు క్రూరులైన ఆట వికులు పట్టుకుని తీసుకుపోయారు. నేను వాళ్ళకు దొరక్కూడా, తప్పించుకు పారి పోయి వచ్చాను," అన్నాడు.

"బందిపోట్ల నాయకుడైన సమరబాహుణ్ణి ఆటవికులు పట్టుకుపోయారా? అంత గొప్ప సమరశూరుణ్ణి పట్టగలిగిన ఆటవికులీ ప్రాంతాల ఎక్కడున్నారు?" అన్నాడు ఖడ్గ వర్మ చిరునవ్వు నవ్వుతూ.

"ఖడ్గా, వాడెంత దుర్మార్గుడైనా, వాడి కన్న దుర్మార్గుల చేతుల్లో చిక్కినట్టుంది. నవ్వకు, పాపం!" అన్నాడు జీవదత్తుడు.

బందిపోట్ల నాయకుడు ఆటవికులకు బందీ అయాడన్న వార్త వింటూనే స్వర్ణా చారి నిలువెల్లా కంపించిపోయాడు. అతడు మొదట్లో బందిపోట్లకు ఖైదీగా చిక్కినా తరవాత తరవాత వాళ్ళు అతణ్ణి ఎంతో గౌరవాదరాలతో చూడసాగారు. నాయకుడు సమరబాహుకూ, స్వర్ణాచారికీ మంచి మైత్రి స్నేహాలు కూడా ఏర్పడినై.

"ఖడ్గ జీవదత్త ప్రభువుల్లారా! భయం కర సంఘటన యిది. మీరు శక్తిమంతులు. ఎలాగైనా సమరబాహును ఆ ఆటవికుల నుంచి విడిపించే ప్రయత్నం చేయాలి," అన్నాడు స్వర్ణాచారి దీనంగా ముఖం పెట్టి.

జీవదత్తుడు, ఖడ్గవర్మ కేసి చూశాడు. ఖడ్గవర్మ అయిష్టంగా తలాడిస్తూ, "జీవా, యీ సహాయపడే విషయమై నీవే ఏదో ఒక నిర్ణయం చేయాలి. మన మిత్రుడైన స్వర్ణాచారి అడుగుతున్నాడు గనక ఆ దుర్మా ర్గుణ్ణి రక్షిద్దామంటావా? అంతా నీ యిష్టం!" అని వూరుకున్నాడు.

జీవదత్తుడు ఒక క్షణం ఆలోచించి, ఎలుగుచర్మాలవాడితో, "ఒరే, మీ నాయ కుణ్ణీ, నీ తోటి వాణ్ణీ, ఆ ఆదిమవాసులు ఎలా పట్టుకున్నారు? అసలు అరణ్యంలో ఏం జరిగింది? ఆ సంగతంతా ముందు చెప్పు," అన్నాడు.

ఎలుగుచర్మాల బందిపోటువాడు, గట్టిగా ఓ మారు గొంతు సవరించుకుని, "అయ్యా, జరిగిందంతా కొద్ది మాటల్లో చెప్పేస్తాను. మీరు త్వరగా సాయం వచ్చి రక్షించక పోతే మా నాయకుణ్ణి క్రూరులైన ఆ నర భక్షకులంతా కలిసి కాల్చుకు తిన్నా తినవచ్చు," అన్నాడు.

—(ఇంకావుంది)






# పేదవాడి బింకం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలకు సంతోషమేగాని, ఒక్కొక్కప్పుడు అది ప్రాణాపాయం కూడా కలిగిస్తుంది. అందుకు నిదర్శనంగా నీకు కింశుకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

మణిపుర రాజ్యంలో కింశుకుడు అనే అతి పేదవాడు ఒకడు ఉండేవాడు. వాడికి ఇల్లూ, వాకిలీ లేదు, బంధుమిత్రులు లేరు, ఆస్తిపాస్తులు లేవు. అలాటివారు శరీరశ్రమ చేసో, బిచ్చం ఎత్తుకునో జీవిస్తారు. కాని కింశుకుడు ఈ రెండు పనులూ చేసేవాడు కాడు ; ఎవరైనా గృహస్థులు పిలిచి పెడితే, పెట్టినది తినేవాడు, లేకపోతే చెరువులో

## బేతాళ కథలు



నీళ్ళు తాగి, . ఏ చెట్టు కిందనో పడుకుని నిద్రపోయేవాడు.

వాడి సంగతి త్వరలోనే నగరమంతా తెలిసిపోయింది. వాడి బింకం గురించి అందరూ చెప్పుకునేవారు. "గతిలేనివాడికి ఇంత బింకమా?" అని కొందరు ఆగ్రహించేవారు. మెత్తని మనసు గలవారు వాడికి తిండి పెట్టేవారు. కింశుకుడు వీధుల వెంట తిరిగి, దయగలవాళ్ళు కనికరించి పెట్టినప్పుడు తినేవాడు; లేనినాడు పస్తుండేవాడేగాని, దేహీ అని ఎవరినీ యాచించేవాడు కాదు.

కింశుకుడి విషయం మణిపుర రాజుకు కూడా తెలియవచ్చింది. చాలాసార్లు, కింశుకుడు రాజభవనం పక్కగా వెళ్ళేటప్పుడు, రాజుకు సేవకులు వాణ్ణి చూపించి, "వాడే బింకం గల బిచ్చగాడు కింశుకుడు," అని చెప్పారు. అవకాశం దొరికితే వాణ్ణి పరీక్షించాలని రాజు అనుకుంటూ ఉండేవాడు.

ఒకనాడు రాజు సాయంకాలం వేళ రాజభవనం పై అంతస్తు మీద చల్లగాలికి తిరుగుతూ ఉండగా, పక్కనే ఉన్న ఉద్యానంలో ఒక రాతితిన్నె మీద పడుకుని ఉన్న కింశుకుడు కనిపించాడు. వాడు పడుకుని ఉన్న తీరుచూస్తే వాడు రెండు మూడు రోజులుగా తిండి లేనివాడిలాగా కనపడ్డాడు. వాడి ముఖంలో జీవకళ ఏ మాత్రమూ కనిపించ లేదు.

రాజు ఒక పరిచారకుణ్ణి పిలిచి, "తోటలో పడుకుని ఉన్న ఆ పేదవాడికి ఇంత భోజనమూ, పాలూ తీసుకుపోయి ఇయ్యి," అని ఆజ్ఞాపించాడు.

పరిచారకుడు ఒక పళ్ళెంలో భోజనమూ, ఒక లోటాలో చిక్కని పాలూ పట్టుకుని తోటలోకి వెళ్ళి కింశుకుడి వద్ద నిలబడి, "వీటని ఆరగించు," అన్నాడు.

ఆకలితో ఉన్న కింశుకుడికి వాటిని చూడగానే ప్రాణం లేచివచ్చింది. అయినా వాడు వాటిని స్వీకరించక, "ఈ భోజనం ఎవరు పంపారు?" అని పరిచారకుణ్ణి అడిగాడు.

"రాజుగారు పంపారు," అన్నాడు పరిచారకుడు, రాజభవనం పై భాగాని కేసి చెయ్యిచాచి.

కింశుకుడు తల ఎత్తి చూశాడుగాని వాడికి భవనం మీద మనుషులెవరూ కనిపించలేదు.

వాడు పళ్ళెంలోని భోజనం గబగబా తిని, పాలు తాగి, "రాజుగారికి నా కృతజ్ఞతలు చెప్పు," అన్నాడు.

పరిచారకుడు వెళ్ళిపోతూ, "నువు ఆకలితో బాధ పడవలసిన అవసరం లేదు. రాజుగారికి నీపై దయ కలిగింది. ఆకలి అయినప్పుడల్లా నువు రాజభవనానికి వచ్చి, సుఖంగా భోజనం చేసి వెళ్ళిపోతూ వుండవచ్చు," అన్నాడు.

రాజుగారి పరిచారకుడు తనను ఒక బిచ్చగాడి కింద జమ కట్టినందుకు కింశుకుడు ముఖం చిట్లించుకుని జవాబు చెప్పలేదు. కాని రాజుగారికి తన పైన అనుగ్రహం కలిగినందుకు వాడికి గర్వంగానే ఉన్నది. ఇంతవరకూ తనకు ఆతిథ్యం ఇచ్చినవాళ్ళందరూ చాలా సాధారణ వ్యక్తులు. ఇవాళ తాను రాజుగారి ఆతిథ్యం సంపాదించాడు!

ఇది జరిగిన మర్నాడు కింశుకుడు నగరమంతా పిచ్చికుక్కలాగా తిరిగాడు. వాడికి ఆ రోజు ఎవరూ పిలిచి భోజనం పెట్టలేదు. ఆ రోజల్లా పస్తుండి మూడో రోజు సాయంకాలందాకా తిరిగినా కింశుకుడికి తిండి దొరకలేదు.





ఆ సాయంకాలం వాడు మళ్ళీ రాజభవనం పక్కన ఉన్న తోటలోకి వెళ్ళి, అదే తిన్నె మీద పడుకున్నాడు.

ఆ రోజు రాజుగారి పరిచారకుడు పళ్ళెంలో మంచి మాంసం కూరలూ, పళ్ళూ, పాయసమూ తెచ్చి కింశుకుడి ముందు పెట్టి, "నీ కిక్కడ మంచి భోజనం దొరుకుతుందని చెప్పానుగదా! నువు రెండు రోజులుగా ఎందుకు రాలేదు?" అన్నాడు.

"నాకీ తోటలో పడుకుంటే బాగుంటుంది. నేను తిండి కోసమే ఇక్కడికి వస్తున్నానని రాజుగారు అనుకుని పోతారేమోననే భయంతో ఇక్కడికి రాకుండా ఉంటున్నాను," అన్నాడు కింశుకుడు.

వాడు పరిచారకుడు తెచ్చిన భోజనమంతా ఆవురావురని తినేసి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

తరవాత వారం రోజులపాటు కింశుకుడు తోట కేసి రాలేదు. వారం గడిచాక వాణ్ణి చూసి రాజు ఆశ్చర్యపోయాడు. వాడు తోటలోకి నడిచివస్తుంటే శవం నడుస్తున్నట్టుగా ఉన్నది. రాజు తన పరిచారకుణ్ణి పిలిచి, కింశుకుడికి తాను తినే భోజనం లాటిదే పంపాడు. భోజనం పళ్ళెం అంత దూరాన ఉండగానే కింశుకుడికి గుప్పున దాని వాసన తగిలింది. పళ్ళెం మీది ఆకు తీసి చూస్తే అందులో అన్నంతోబాటు మీగడపెరుగూ, మిఠాయీ ఉన్నాయి.

ఆ భోజనం తిని నీరసంగా నడుచుకుంటూ వెళ్ళిపోయిన కింశుకుడు పది రోజులపాటు రాజుగారి కళ్ళపడనే లేదు. వాడు చచ్చిపోయి ఉంటాడని భయపడి రాజుగారు తన భటులను వాడి కోసం వెతకమని పంపాడు.

వాళ్ళు చావటానికి సిద్ధంగా ఉన్న కింశుకుణ్ణి కొసప్రాణంతో మోసుకువచ్చి, రాజుగారి ముందు పెట్టారు.

వాణ్ణి చూసి రాజు కంట తడిపెట్టుకుంటూ, "నన్ను క్షమించు!" అన్నాడు.

"మహారాజా, ఇందులో క్షమించటానికేమున్నది, తప్పు నాదే. మీలో ఏ దోషమూ

లేదు," అంటూ కింశుకుడు ప్రాణాలు వదిలాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాజుగారు పెట్టే పుష్టికరమైన ఆహారం తింటూ కూడా కింశుకుడు ఎందుకు శుష్కించి చచ్చే స్థితికి వచ్చాడు? రాజు వాణ్ణి క్షమాపణ ఎందుకు వేడుకున్నాడు? తప్పు తనదేనని కింశుకుడు ఎందుకు అన్నాడు? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఎవరేది పెట్టినా తిని పొట్టపోసుకునే కింశుకుడు రాజుగారి భోజనం తిన్నమీదట ఇతరులు పెట్టే ఆహారం తినలేక, ఆకలితో మాడి శుష్కించి ఉంటాడు. రాజు కింశుకుణ్ణి పరీక్షించటానికి తిండి పెట్టాడేగాని, వాడిపై దయ తలచి కాదు. రాజు పరీక్షకు పెట్టినది కింశుకుడి బింకాన్ని. వాడు తాను పెట్టే ఆహారం కోసం రోజూ తోటకు వస్తాడనీ, వాడి పట్టుదల సడలుతుందనీ రాజు అనుకున్నాడు. రాజు పెట్టిన పరీక్ష విజయవంతమైనది అనిపించింది. ఎందుకంటే కింశుకుడు రెండుసార్లు తోటకు భోజనం కోసమే వచ్చాడు. కాని తన పట్టుదల సడలిపోతూండటం చూసి వాడు మాడి చావటానికి కూడా సిద్ధమయాడు. వాడు అంతకు సాహసిస్తాడని రాజు అనుకోలేదు. వాడి చావుకు తన పరీక్ష కారణం కావటం చేత రాజు వాడికి క్షమాపణ చెప్పుకున్నాడు. కింశుకుడు తన తప్పు ఒప్పుకోవటానికి కారణం ఏమంటే వాడు రెండోసారీ, మూడోసారీ తోటకు రాకుండా ఉన్నట్టయితేనూ, రాజుగారికి తనపై గొప్పవాత్సల్యం కలిగిందనుకోకపోతేనూ వాడు తప్పక తన మామూలు జీవితం జీవించగలిగేవాడు. రాజుగారు తన పట్టుదలను పరీక్షిస్తున్నట్టు గ్రహించలేకపోవటమే కింశుకుడి తప్పు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# తెలివి తక్కువ రాజు

పూర్వం తిరుచినాపల్లిని పాలించిన శూరసేనుడు మూర్ఖుడు. కాని ఆయన మంత్రి సుబుద్ధి చాలా తెలివిగలవాడు.

ఒకనాడు రాజు కావేరీతీరానికి వెళ్ళి, నది తూర్పుగా ప్రవహిస్తూ ఉండటం చూశాడు. ఆయన సుబుద్ధిని పిలిపించి, "చూడు, సుబుద్ధీ, మనకు తూర్పుగా ఉన్న తంజావూరు మనకు శత్రుదేశం కదా! మన దేశం నుంచి పోయే నీటితో వారు వ్యవసాయం ఎందుకు చేసుకోవాలి? వెంటనే నదికి ఆనకట్ట కట్టించు," అని ఆజ్ఞాపించాడు.

మూర్ఖుడైన రాజుకు ఎదురు చెప్పి లాభం లేదు. అందుచేత మంత్రి నెల రోజులలో నదికి ఆనకట్ట కట్టించాడు. నది పొంగి నగరంలోకి ప్రవహించసాగింది. ప్రజలు ఆందోళన చెంది, రాజుతో మొరపెట్టుకునే ధైర్యం లేక మంత్రితో మొరపెట్టుకున్నారు. మంత్రి వారికి ధైర్యం చెప్పి పంపేసి, కోటలో గంటలు కొట్టేవాణ్ణి పిలిచి, "ఈ రాత్రి అరగంటకు గంట చొప్పున కొట్టి, అర్ధరాత్రికి నగారా మోగించు," అని చెప్పాడు.

రాజు నగారా మోత విని తెల్లవారిందనుకున్నాడు. కాని తూర్పున సూర్యోదయం జాడలు లేవు. ఆయన మంత్రిని పిలిచి, "సూర్యుడు ఇవాళ ఇంకా ఎందుకు ఉదయించ లేదు?" అని అడిగాడు.

"మహారాజా, మనం నీటిని బంధించామని, తంజావూరు వాళ్ళు సూర్యుణ్ణి బంధించి ఉంటారు," అన్నాడు మంత్రి.

"అలా అయితే వెంటనే ఆనకట్టను పగలగొట్టించు," అన్నాడు రాజు.

—బి. శ్రీనివాసులురెడ్డి ఎమ్.యస్‌సి.





# లోభివర్తకుడు

కుంతి అనే గ్రామంలో ఉపలుడు అనే వర్తకుడు ఉండేవాడు. ఆయన కొడుకు విష్ణు అనేవాడు చదువుకున్న వాడూ, సౌమ్యుడూ, ఉదారభావాలు కలవాడూనూ. తండ్రి చేసే వడ్డీవ్యాపారం ఇష్టం లేక విష్ణు సొంతంగా ధాన్యవ్యాపారం ప్రారంభించి, ఆహారధాన్యాలు సరసమైన ధరలకు అమ్ముతూ వచ్చాడు.

అదే గ్రామంలో చౌధురీల కుటుంబం ఉండేది. ఆ కుటుంబానికి పెద్ద అయిన దీను అనేవాడు సమీపంలోని పట్టణంలో వ్యాపారం చేసి చాలా నష్టపోయి, సకుటుంబంగా స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. దీను కపటా కల్లమూ లేని సాధు సత్పురుషుడు. అందుచేత వర్తకంలో అతని భాగస్వామి అయినవాడు ఆయనను దగాచేసి పెట్టుబడీ, లాభాలూ తనవే అనేశాడు. ఇప్పుడు దీను చాలా పేదవాడు.

దీను కుమార్తె లక్ష్మి చాలా నాజూకైన పిల్ల, మంచి తెలివి తేటలుగలది. ఆమెకు పెళ్ళియీడు వచ్చింది. కాని ఆమె వివాహం చెయ్యటానికి తగినంత డబ్బు దీనుచౌధురి వద్ద లేదు.

ఆశాపాతకుడైన ఉపలుడు తన కొడుక్కు ఏ రాజకుమార్తె అయినా అర్ధరాజ్యంతో వస్తుందా అన్నంత దురాశతో ఉన్నాడు. నిజానికి విష్ణుకు లక్ష్మి అన్నివిధాలా తగిన భార్య. విష్ణును మొదటిసారి చూడగానే లక్ష్మి తల్లి, అతను తమకు అల్లుడైతే బాగుండు ననుకున్నది.

విష్ణు కూడా లక్ష్మిని, చెరువు నుంచి నీరు తెస్తూ ఉండగా చూసి ఆమెను తన భార్యగా మనసులో వరించుకున్నాడు.

ఒకనాడు దీనుతో ఆయన భార్య, "ఒకసారి ఉపలుణ్ణి కలుసుకుని, వాళ్ళ అబ్బాయికి మన అమ్మాయిని చేసుకుంటారేమో

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

అడిగి చూడరాదా? అంతకన్న మంచి సంబంధం దొరకదు,'' అన్నది.

''ఆ మాట మరిచిపో. ఉపలుడు తన కొడుకు ద్వారా డబ్బు సంపాదించే ఎత్తులో ఉన్నాడు. మనబోటి బీదకుటుంబీకులం అతగాడికి అనుతామా?'' అన్నాడు దీను నిరాశగా.

దీను భార్య ఒకనాడు విష్ణును తన ఇంటికి భోజనానికి పిలిచింది. భోజనం అయాక ఆమె తన ఉద్దేశం చెప్పింది.

''నాకేమీ అభ్యంతరం లేదు. మీ చౌధురీలది గొప్ప వంశం. మీ అమ్మాయి చక్కనిది; మంచిది. ఒకప్పుడు మీరు ఘనంగా బతికినవారే, కాని ప్రస్తుతం చితికి ఉన్నారు. నాకు కావలసింది పిల్లే గాని, డబ్బు కాదు. కాని మా తండ్రికి కావలిసింది డబ్బు. ఆయన ధనదాహం ఎవరన్నా పోగొట్టగలిగితే లక్ష్మిని కోడలుగా స్వీకరిస్తాడు. డబ్బుతో ఆయన దాహాన్ని తీర్చలేరు గనక, మరొక మార్గం ఏదన్నా చూడండి.'' అని విష్ణు అన్నాడు.

ఈ సంభాషణ జరిగిన రోజు లక్ష్మి మేనమామ శ్యామగుప్త అక్కడే ఉన్నాడు. ఆయన చాలా యుక్తులు తెలిసినవాడు; జరిగిన సంభాషణ అంతా విని, ''సరేలే, ఆ సంగతి నేను చూస్తాను. విష్ణుకూ, లక్ష్మికీ పెళ్ళి అయేటట్టు చూసే పూచీ నాదీ!'' అన్నాడు.

మర్నాడు ఉదయం శ్యామగుప్త ఉపలుడి ఇంటికి వెళ్ళి, ఆ కబురూ ఈ కబురూ



మాట్లాడి; చివరకు మాటవరసగా, విష్ణుకు లక్ష్మిని చేసుకోమని అడిగాడు.

"బాగా చెప్పారు! తిండికి గతిలేని వాళ్ళ పిల్లను చేసుకోమంటారా? అదేమీ కుదరదు," అన్నాడు ఉపలుడు.

శ్యామగుప్త తొణకకుండా, "అయితే మీకు మా మేనగోడలికి గల అద్భుత శక్తి గురించి తెలియదన్నమాట. ఆ పిల్ల మామూలు నీటి మీద ఊది మధురపానీయంగా మార్చగలదు," అన్నాడు.

డబ్బు విషయంలో తప్ప మిగిలిన అన్ని విషయాలలోనూ మందమతి అయిన ఉపలుడు, "ఎలాగెలాగూ?" అన్నాడు.

"అవునండీ! మీరు కట్నాలూ, కానుకలూ గురించి ఆలోచిస్తారు గాని, అవి ఇలా వస్తాయి, అలా పోతాయి. లక్ష్మి మీ కోడలైతే రాగి డబ్బు ఖర్చు చెయ్యకుండా మధురపానీయాలు తయారు చేసి అమ్మి, లక్షలు సంపాదించవచ్చు." అన్నాడు శ్యామగుప్త.

డబ్బు మాట వినగానే ఉపలుడి ధన లోభం ఎగిరి గంతేసింది.

"నిజమా? మీ మేనకోడలికి అలాంటి శక్తి వున్నదా?" అన్నాడాయన.

"ఇవాళ సాయంకాలం అలా మా వాళ్ళింటికి వచ్చి, నేను చెప్పినది నిజమో, కాదో మీరే స్వయంగా పరీక్షించి తెలుసుకోండి. అన్నట్టు, వచ్చేటప్పుడు ఒక గ్లాసు మంచి నీరు మీరే తీసుకురండి," అన్నాడు శ్యామగుప్త.



ఆ సాయంకాలం ఉపలుడు తన భార్యనూ, కొడుకునూ వెంటబెట్టుకుని దీను చౌధురీ ఇంటికి వచ్చాడు. ఉపలుడి భార్య లక్ష్మి అందమూ, నడవడికా చూసి ఎంతో ముచ్చటపడి, ఆ పిల్ల తన కోడలైతే ఎంత బాగుండు ననుకున్నది.

ఉపలుడు ఒక గ్లాసు పైకి ఎత్తి, "ఇదుగో, నీరు తెచ్చాను. దీన్ని మధురపానీయంగా మార్చే శక్తి నీ కున్నదన్నారు. ఏదీ, మధుర పానీయం చేసి చూపించు," అన్నాడు లక్ష్మితో.

లక్ష్మి ఆయనతో, "ఆ నీరు కొద్దిగా తాగి, రుచి ఎలా ఉన్నదో చూడండి," అన్నది.

ఉపలుడు కొద్దిగా నీరు తాగి, "నీటి రుచిగానే ఉన్నది," అన్నాడు.

లక్ష్మి ఆయన చేతి నుంచి గ్లాసు తీసుకుని, దాని మీద ఊది, దాన్ని ఉపలుడికి తిరిగి ఇస్తూ, "ఇప్పుడు దాని రుచి ఎలా ఉన్నదో చూసి చెప్పండి," అన్నది.

ఉపలుడు నీరు రుచి చూసి, ఎగిరి గంతేసి నిలబడి, "అమ్మాయీ, అద్భుతం! ప్రధానం కింద ఈ హారం తీసుకో. నిన్ను నా కోడలు చేసుకుంటాను," అన్నాడు నిశ్చయంతో.

లక్ష్మికీ, విష్ణుకూ వైభవంగా పెళ్ళి జరిగి పోయింది. ఆడపెళ్ళి వారికి దమ్మిడీ ఖర్చు లేదు. వారి ఖర్చంతా ఉపలుడే సంతోషంగా భరించాడు.

ఆ తరవాత విష్ణు లక్ష్మిని, "ఆ రోజు నీరు తియ్యగా ఎలా చేశావు?" అని అడిగాడు.

"శాకరీన్ అండీ, శాకరీన్! మా మామయ్యా నా చూపుడు వేలు చివర శాకరీన్ రాశాడు. మీ నాన్న చేతి నుంచి గ్లాసు తీసుకునే టప్పుడు ఆ వేలు నీటిలో ముంచాను. దానితో నీరు తియ్యబడింది," అన్నది లక్ష్మి.

"ఇప్పుడేం చేస్తావు?" అని విష్ణు అడిగాడు.

"పెళ్ళి అయి ఇంటి పేరు మారగానే నా శక్తి కాస్తా పోయిందంటాను. ఆ పైన సమాచారం అంతా మీ అమ్మా, మీరూ చూసుకోండి," అన్నది లక్ష్మి.





# వింతవీలునామా

జెరుసలేము నగరంలో ఒక ప్రముఖ వర్తకుడు ఉండేవాడు. ఆయనకు ఒక్కడే కొడుకు. వర్తకుడు వ్యాపారం మీద చాలా వరకు దూరదేశాలలో గడిపేవాడు. అందు చేత ఆయన కొడుకు ఇంటి వద్దనే ఉండి చదువుకుంటూ ఉండేవాడు. వర్తకుడు వ్యాపారం చేస్తూ దేశాలు తిరిగేటప్పుడు ఆయన వెంట ఆయన బానిస ఉండేవాడు.

ఒకసారి వర్తకుడు దూర దేశంలో ఉండగా ఆయనకు జబ్బు చేసింది. ఆ జబ్బు నయమయేటట్టు కనిపించలేదు. తనకు చావు దగ్గిర పడుతున్నదని తోచి వర్తకుడు తన కొడుకును గురించి ఆందోళన పడ్డాడు. వాడింకా పసివాడు. వర్తకుడు తన ఆస్తి అంతా తన కొడుకు పేర రాస్తే తన బానిస వాడు దాన్ని తేలికగా అన్యాక్రాంతం చేసి, తన కొడుకుకు ఏమీ మిగలకుండా చెయ్యొ వచ్చు. అలా జరగకుండా ఎలా వీలునామా రాయాలా అని దీర్ఘంగా ఆలోచించి, వర్తకుడు ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఆయన తన వీలునామా రాయటానికి ఒక లేఖకుణ్ణి పట్టుకు రమ్మని తన బానిసను నగరంలోకి పంపాడు. వాజ్మాలాలు మొద లైనవి రాయగల లేఖకుడు ఒకడు వచ్చి, వర్తకుడు చెప్పిన ప్రకారం ఆయన వీలు నామా రాశాడు. ఆ వీలునామా ద్వారా వర్తకుడు తనకు గల యావదాస్తీ తన బానిసపరం చేస్తూ, ఆ ఆస్తిలో ఏదో ఒక్కటి మాత్రం వర్తకుడి కొడుకు కోరుకోవచ్చు నన్నాడు. అదీ ఆ వింత వీలునామా సారాంశం.

త్వరలోనే వర్తకుడు జబ్బుతో మరణించాడు. ఆయన బానిస ఆ వీలునామా పుచ్చుకుని జెరుసలేము నగరానికి తిరిగి వచ్చాడు. వాడు తన వద్ద ఉన్న వీలునామా ప్రకారం వర్తకుడి ఆస్తి యావత్తూ స్వాధీనపరచుకున్నాడు.

యూదు జానపద కథ

తన తండ్రి చనిపోయాడని తెలిసి వర్తకుడి కొడుకు తన తండ్రి ఆస్తి అంతా తన పరం చెయ్యమని బానిసను అడిగాడు.

బానిస ఆ పని చెయ్య నిరాకరిస్తూ, వర్తకుడి వీలునామా ఆ కుర్రవాడికి చూపి, "చూడు, ఇది నీ తండ్రి చనిపోతూ రాయించిన వీలునామా. దీని ప్రకారం నీ తండ్రి ఆస్తి అంతా నాకు చెందుతుంది. కావాలంటే నువు ఆ ఆస్తిలో ఏదో ఒకటి కోరుకుని తీసుకోవచ్చు," అన్నాడు.

వర్తకుడి కొడుకు ఆ వీలునామా చూసి దిగ్భ్రమచెందాడు. అతనికి ఏం చెయ్యటానికీ పాలుపోక, తన తండ్రికి మిత్రుడైన ఒక వృద్ధుడి వద్దకు వెళ్ళి, సంగతి అంతా చెప్పి, ఆయనను సలహా అడిగాడు.

ఆ వృద్ధుడు గొప్ప మేధావీ, లౌకికుడూనూ. ఆయన కుర్రవాడి మాటలు శ్రద్ధగా విని, "బాబూ, నువు ఏ మాత్రమూ విచారించకు. నీకు వచ్చిన నష్టం ఏమీ లేదు. అలా వీలునామా రాసి నీ తండ్రి నీకు గొప్ప మేలు చేశాడు. రేపు న్యాయస్థానానికి రా. మీ తండ్రి రాసిన వీలునామా తీసుకుని మీ బానిసను కూడా అక్కడికి రమ్మను. అక్కడ నువు నా సలహా ప్రకారం మసులుకుంటే అంతా చక్కబడుతుంది," అన్నాడు.

మర్నాడు ఉదయం వర్తకుడి కొడుకూ, వర్తకుడి వీలునామాతో సహా బానిసా హాజరయారు. న్యాయాధికారి సమక్షంలో వీలునామా చదివారు.

"అయితే, మీ తండ్రి ఆస్తి నుంచి నువు ఏమి కోరుకుంటావు?" అని న్యాయాధికారి వర్తకుడి కొడుకును అడిగాడు.

ఆ ప్రశ్నకు ఏమి సమాధానం చెప్పాలో వృద్ధుడు ముందే తనకు చెప్పి ఉండటం చేత, వర్తకుడి కొడుకు తన తండ్రి బానిసను చూపి, "నేనా బానిసను కోరుకుంటున్నాను," అన్నాడు.

న్యాయాధికారి బానిసను వర్తకుడి కొడుకు పరం చేశాడు. ఆ విధంగా బానిస వాడి అధీనమైన వర్తకుడి ఆస్తి యావత్తూ వర్తకుడి కొడుకు పరమయింది.





# వరపరీక్ష

పాంచాళదేశపు రాజైన మతిమంతుడికి చక్కని చుక్కలాటి కుమార్తె ఉండేది. ఆమెకు చంద్రిక అని పేరు పెట్టుకుని తల్లిదండ్రులు ఎంతో శ్రద్ధగా పెంచారు. మతిమంతుడు పాండిత్యాన్ని ఎంతగానో అభిమానించేవాడు. అందుచేత ఆయన చంద్రికకు గొప్ప విద్వాంసుల చేత చదువు చెప్పించాడు.

చంద్రిక యుక్త వయస్కురాలయింది. ఆమె వివాహం గురించి రాజు తన మంత్రులతో ఆలోచనలు ప్రారంభించాడు. మనుషులను పంపి దేశ దేశాల రాజకుమారుల పటాలు తెప్పించాడు.

ఇది చూసి చంద్రిక తన తండ్రితో, "నాన్నగారూ, ఈ పటాలు చూసిన మాత్రాన వారి తెలివి తేటలు మనకు ఏం తెలుస్తాయి? నా కంటె తెలివితేటలు లేని వాణ్ణి నేను పెళ్ళాడలేను. మీకు అభ్యంతరం లేకపోతే నేను ఒక పరీక్ష పెట్టి, అందులో నెగ్గిన వాణ్ణి పెళ్ళాడుతాను," అన్నది.

రాజు, మంత్రులతో సంప్రతించి, కుమార్తె కోరికకు తన అంగీకారం తెలిపాడు.

చంద్రిక వెంటనే ఈ విధంగా ఒక శ్లోకం రాసి తండ్రికి ఇచ్చింది:

"ప్రాత ర్ద్యూత ప్రసంగేన,
మధ్యాహ్నే స్త్రీప్రసంగతః,
రాత్రౌ చోరప్రసంగేన
కాలో గచ్ఛతి ధీమతామ్."

రాజు ఆ శ్లోకాన్ని సభా భవనంలో ఒక శిలాఫలకం మీద సువర్ణాక్షరాలతో చెక్కించి, తన కుమార్తె స్వయంవర వార్త దేశదేశాలకూ అందజేశాడు.

ఈ వార్త వింటూనే రాజకుమారులు ఒక్కరొక్కరే రాసాగారు. ప్రతి ఒకరూ

కాకుటూరి పద్మావతి

ఆ శ్లోకాన్ని చదివి, ఈ విధంగా దానికి అర్థం చెప్పారు :

"ఉదయంవేళ జూదం గురించిన ప్రసంగాలతోనూ, మధ్యాహ్నం స్త్రీలను గురించిన ప్రసంగాలతోనూ, రాత్రివేళ దొంగలను గురించిన ప్రసంగాలతోనూ బుద్ధిమంతులైన వాళ్ళు తమ కాలాన్ని వెళ్ళబుచ్చుతారు."

కాని ఆ శ్లోకానికి ఇది సరి అయిన అర్థం కాదని చంద్రిక వారి నందరినీ నిరాకరించింది. అంతకన్న ఆ శ్లోకంలో మరే అర్థం ఉన్నదీ ఎవరికీ బోధపడలేదు. తమ కుమార్తె ప్రవర్తన అసంగతంగా ఉన్నదని రాజూ, రాణీ భయపడసాగారు.

ఇదంతా గమనిస్తున్న యువకుడు జయసింహుడనే వాడు. అతను మాళవసేనాధిపతి కొడుకు. అతను ఆ శ్లోకానికి అర్థం చెప్పటానికి రాజుగారి అనుమతి వేశాడు. రాజు సమ్మతించాడు.

జయసింహుడు రాజునూ, సభనూ ఉద్దేశించి ఇలా చెప్పాడు :

"ఈ శ్లోకంలో బుద్ధిమంతులు ఎలా కాలం గడుపుతారో చెప్పి ఉన్నది. అందుచేత శ్లోకంలో చెప్పి ఉన్న ప్రసంగాలకు చెప్పే అర్థం బుద్ధిమంతులకు వర్తించేదిగా ఉండాలి. జూదానికి సంబంధించిన ప్రసంగం అంటే మహాభారతం గురించిన ప్రసంగం. మహాభారత కథ అంతా ఒక జూదం మీద ఆధారపడివున్నది. అలాగే రామాయణం స్త్రీల మీద ఆధారపడినది. కైకవరాలూ, సీతాపహరణమూ లేకపోతే రామాయణకథే లేదు. అందుచేత స్త్రీలను గురించిన ప్రసంగం అంటే రామాయణ ప్రసంగం. చోర ప్రసంగం అంటే కృష్ణుడి కథ. చోరత్వానికి ప్రసిద్ధికెక్కిన భగవంతుడి అవతారం కృష్ణావతారమే. ఈ విధంగా అర్థం చెప్పుకుంటేనే మొత్తం శ్లోకానికి అర్థం ఏర్పడుతుంది."

జయసింహుడు చెప్పిన అర్థంతో ఏకీభవించి చంద్రిక అతని మెడలో వరమాల వేసింది. వారిద్దరికీ వైభవంగా వివాహం జరిగింది.





# కీలుగుర్రం

## 3

తెల్లవారగానే తన సైన్యంతో తాను ఒక్కడే యుద్ధం చేసి ఆ యువకుడు నిశ్చయంగా చచ్చిపోతాడనీ, తన కుమార్తెకు అపఖ్యాతి తొలగి పోతుందనీ రాజుకు నమ్మకంగానే ఉన్నది. తెల్లవారే సరికల్లా సైన్యాలు యుద్ధ సన్నద్ధమై ఉండాలని ఒక కొజ్జా వాడిద్వారా తన వజీరుకు కబురుపంపి, రాజు మిగిలిన రాత్రి అంతా రాజకుమారుడితో కబుర్లు చెప్పుతూ గడిపాడు.

తెల్లవారింది. రాజు ఖమర్ కోసం గుర్రపు సాలలో వున్న శ్రేష్ఠమైన గుర్రాన్ని సిద్ధం చేసి పట్టుకు రమ్మని తన నౌకర్లకు ఉత్తరు విచ్చాడు.

అది విని ఖమర్ రాజకుమారుడు, "నేను మీ నగరానికి ఎక్కివచ్చిన గుర్రం నాకు చాలు, వేరే గుర్రం అవసరం లేదు," అని చెప్పాడు.

"సరే, నీ యిష్టం వచ్చినట్టే కానివ్వు!" అన్నాడు రాజు.

ఇద్దరూ కలిసి మైదానానికి వచ్చారు. అక్కడ రాజుగారి సేన యుద్ధానికి సిద్ధంగా బారులుతీరి ఉన్నది.

సైనికులతో రాజు, "యోధులారా, ఈ యువకుడు నన్ను నా కుమార్తెను తనకిచ్చి వివాహం చెయ్యమని అడుగుతూ ఇక్కడికి వచ్చాడు. ఇతను చాలా అందమైనవాడూ, గొప్ప వీరుడునూ. ఇతను మిమ్మల్ని అందరినీ తన ఒంటి చేతిమీద ఓడించగలనంటున్నాడు. మీ సంఖ్య ఇంకా లక్షరెట్లు ఉన్నా అతనికి లక్ష్యం లేదుట. అందుచేత అతను మీ మీదికి వచ్చినప్పుడు మీరు ఏ మాత్రమూ సంకోచించక ఎదుర్కొన వచ్చు. అలా అయితే గాని అతని ప్రగల్భాలు తగ్గవు." అన్నాడు.

తరవాత ఆయన ఖమర్ కేసి తిరిగి, "బాబూ, ధైర్యంగా పోరాడి, నీ ప్రతాపం చూపించు." అన్నాడు.

ఖమర్ ఆయనతో, "మహారాజా, మీరు అన్యాయం చేస్తున్నారు. నేను పాదచారిగా ఉండి అంతమంది అశ్వికులతో ఎలా యుద్ధం చెయ్యగలను?" అన్నాడు.

"నేను నీకు గుర్రం ఇస్తానంటే వద్దన్నావు గద. కావాలంటే ఇప్పుడైనా నువు కోరిన గుర్రాన్ని ఇస్తాను." అన్నాడు రాజు.

"నాకు మీ గుర్రాలలో ఏదీ అవసరం లేదు. నేను మీ దేశానికి ఎక్కి వచ్చిన గుర్రం నాకు చాలు." అన్నాడు ఖమర్.

"ఏదీ? అది ఎక్కడ ఉన్నది?" అని రాజు అడిగాడు.

"మీ రాజభవనం పైన." అన్నాడు ఖమర్.

రాజు నిర్ఘాంతపోయి, "నా రాజభవనం పైననా? రాజభవనం పైన గుర్రం ఉండటమేమిటి? నీమతి సరిగా లేదనటానికి ఇంతకన్న ఏం నిదర్శనం కావాలి? అయినా మనిషిని పంపి చూస్తాను." అంటూ తన సేనానాయకుడితో, "నువు వెంటనే రాజభవనం మీదికి వెళ్ళి, డాబా మీద ఏది కనిపిస్తే అది తీసుకురా," అన్నాడు.

ఖమర్ మాటలు విన్న సైనికులు తమలో తాము, "గుర్రం ఆ మెట్లన్నీ ఎక్కి రాజభవనం పై భాగానికి వెళ్ళటమేమిటి? ఇలాటి విడ్డూరం ఎక్కడైనా కద్దా?" అనుకున్నారు.



ఈలోపల రాజు పంపిన సేనానాయకుడు మెట్లెక్కి రాజభవనం పైడాబా చేరుకుని, అక్కడ చాలా అందమైన గుర్రాన్ని చూశాడు. తీరా దగ్గిరికి వెళ్ళి చూస్తే అది కొయ్యతోనూ, దంతంతోనూ చేసిన గుర్రం బొమ్మ. అది చూసి అతనూ, అతని వెంట వచ్చిన సైనికులూ విరగబడి నవ్వుకుని, "ఆ అబ్బాయి చెప్పిన గుర్రం ఇదా? వాడికి నిజంగా పిచ్చే! అయినా నిజం తెలిస్తేగాని ఏ సంగతీ చెప్పటానికి లేదు," అనుకున్నారు.

వాళ్ళు ఆ కొయ్యగుర్రాన్ని ఎత్తుకుపోయి రాజుగారి ముందు పెట్టారు. రాజు అమిత ఆశ్చర్యంతో ఖమర్‌ను చూసి, "ఇదా నీ గుర్రం?" అని అడిగాడు.

"అవును. ఇప్పుడే మీ అందరికీ దీని అద్భుత శక్తులు చూపుతాను," అన్నాడు ఖమర్ నవ్వుతూ.

"అయితే, ఆలశ్యం ఎందుకు? ఎక్కు!" అన్నాడు రాజు.

"ఈ సైనికులు వెనక్కుపోతేనే గాని ఎక్కను," అన్నాడు ఖమర్.

రాజు తనకు సమీపంలో ఉన్న సైనికులనందరినీ దూరంగాపోయి నిలబడవలసిందిగా ఆజ్ఞాపించాడు.

"మహారాజా, చూస్తూ ఉండండి. నేనీ గుర్రం మీదికి లంఘించి, మీసేన మీదికి దూకి, చిందర వందర చేస్తాను. వాళ్ళను హడలగొట్టి, కంపరం ఎత్తిం చేస్తాను," అన్నాడు ఖమర్.





"నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి. నువు వాళ్ళను దయదలచ నక్కర్లేదు. వాళ్ళు నిన్ను దయతలచరు," అన్నాడు రాజు.

వెంటనే ఖమర్ గుర్రం మెడ మీద చెయ్యివేసి, దానిమీదికి లాఘవంగా ఎక్కి కూర్చున్నాడు. అతను తమ మీదికి వచ్చే టప్పుడు అతన్ని తమ శూలాలకు గుచ్చి పైకెత్తుదామని సైనికులు అనుకున్నారు. మరి కొందరు, అంత అందంగానూ, సుకుమారంగానూ ఉన్నవాణ్ణి ఎలా చంపట మనుకున్నారు. ఇంకా కొందరు, అతను వెర్రివాడు కాడనీ, గెలుస్తానన్న ధైర్యం ఉండబట్టే ఈ యుద్ధానికి తలపడ్డాడనీ అనుకున్నారు.

గుర్రం మీద ఎక్కి కూర్చున్న ఖమర్ మీట కొద్దిగా నొక్కి గుర్రాన్ని ముందుకూ, వెనక్కూ కదిలేటట్లూ, నేలను గీరేటట్టూ చేశాడు. ఉన్నట్టుండి దాని కడుపు గాలి నించుకుని పెద్దదయింది. అది బాణంకన్న వేగంగా ఆకాశంలోకి లేచింది. దానితోబాటు ఖమర్ కూడా పైకి వెళ్ళిపోయాడు.

ఆశ్చర్యంతోనూ, ఆగ్రహంతోనూ రాజు కింద పడినంత పని చేశాడు; "పారి పోతున్నాడర్రా! పట్టుకోండి. అలా నిలబడ తారేం మొద్దు వెధవల్లాగా?" అని ఆక్రోశించాడు.

"మహారాజా, ఎగిరే పక్షిని ఎవరు పట్టుకో గలరు? వాడు అందరిలాటి మనిషి కాడు. మాంత్రికుడో, పిశాచమో, గాలి దయ్యమో అయి ఉంటాడు. వాడు పోయాడు, అంతే చాలు! ఈశ్వరానుగ్రహం వల్ల మనమంతా వాడి బారి నుంచి బయట పడ్డాం. అందుకు సంతోషించాలి," అన్నారు రాజుగారి మంత్రులు మొదలైనవాళ్ళు.

పూర్తిగా అయోమయంలో పడి రాజు తన భవనానికి తిరిగి వెళ్ళి, తన కుమార్తెతో మైదానం మీద జరిగినదంతా చెప్పాడు. తన ప్రియుడు వెళ్ళి పోయాడనగానే రాజ కుమార్తె ఏడిచి, శోకాలుపెట్టి, మంచం మీద విరుచుకు పడిపోయి క్షణాల మీద రోగం తెచ్చుకున్నది.

రాజు ఆమెను ఓదార్చుతూ, "ఎందు కేడుస్తావే, పిచ్చిదానా? వాడు మాయల మారి వాడు, దొంగ, పశువు! వాడు మనకు ఎలాంటి హానీ కలిగించకుండా వదిలి నందుకు అందరితోపాటు నువ్వూ సంతో షించు," అన్నాడు.

కుమార్తెను ఊరడించటానికి రాజు చేసిన ప్రయత్నం వ్యర్థమయింది. ఆయన మాట లేవీ ఆమె తలకెక్కలేదు. ఆమె మరింత ఏడుస్తూ, "నా ప్రియుణ్ణి చేరుకున్నదాకా నేను మంచినీరు కూడా ముట్టను. అంత దాకా నాకు శోకం రాసిపెట్టి ఉన్నది," అన్నది.

రాజు తన కుమార్తె శోకాన్ని తగ్గించలేక పోగా, తానే శోకంలో మునిగిపోయాడు. ఆయనకు ప్రపంచమంతా అంధకారం అయిపోయింది.

ఈలోపల, గాలిలోకి ఎగిరిపోయిన రాజ కుమారుడు గుర్రాన్ని తన దేశం కేసి పోనిచ్చి, తాను రాజకుమార్తెను గురించి ఆలోచనలో పడిపోయి, ఆమెను తిరిగి కలుసుకునేటందుకు మార్గం ఆలోచించ సాగాడు. తాను దిగినది యమన్‌దేశంలో ననీ, ఆ నగరం సనా అనీ అతనికి తెలిసి పోయింది. అయినా అక్కడికి ఎలా తిరిగి రావాలో అతనికి తోచలేదు.

అతని కీలుగుర్రం అతివేగంగా వెళ్ళ గలది కావటం చేత అతను తన నగరానికి త్వరలోనే తిరిగి చేరాడు. అతను గాలిలో నగరం చుట్టూ ఒక ప్రదక్షిణం చేసి, రాజ





భవనం పై భాగాన దిగాడు. గుర్రాన్ని భవనం మీదనే వదిలి, అతను భవనం దిగి వెళ్ళాడు. ఏ గది చూసినా నిశ్శబ్దంగా ఉన్నది. అన్ని గదులలోనూ బూడిద చల్లి ఉన్నది. అది చూసి అతను రాజకుటుంబంలో ఎవరో పోయి ఉంటారనుకున్నాడు. రాజుగారి మందిరంలోకి అతను వెళ్ళే సరికి, అక్కడ రాజూ, అతని చెల్లెళ్ళూ మైలదుస్తులు ధరించి, పుట్టెడు దుఃఖంలో ఉన్నారు. వారి కళ్ళు వాచి ఉన్నాయి.

ఖమర్‌ను చూడగానే రాజు చివాలున లేచి, పెద్దగా కేకపెట్టి మూర్ఛపోయాడు. తిరిగి స్పృహ తెలియగానే ఆయన తన కొడుకును గట్టిగా కౌగలించుకుని, ఆనంద బాష్పాలు రాల్చాడు. అతని తల్లీ, చెల్లెళ్ళూ అతన్ని తనివిదీర ముద్దులు పెట్టుకుని, అతని చుట్టూ నృత్యం చేస్తూ, వాళ్ళు కూడా ఆనందబాష్పాలు రాల్చారు.

ఉద్రేకాలు కాస్త తగ్గినాక వాళ్ళు అతన్ని ఏం జరిగిందని అడిగారు. అతను వారికి జరిగినదంతా వివరంగా చెప్పాడు.

అంతా విన్నాక రాజు భగవంతుడికి కృతజ్ఞత తెలుపుకుని, ఏడు రోజులపాటు దేశంలోని ప్రజల కందరికీ విందులు చేసి, బహుమతు లిచ్చి, ఖైదీలందరినీ విడిపించాడు. పోయాడనుకున్న రాజకుమారుణ్ణి ప్రజలు చూసి ఆనందించగలందులకు తండ్రి కొడుకు లిద్దరూ గుర్రాల మీద నగర వీధులన్నీ తిరిగారు.

ఉత్సవాలూ, ఊరేగింపులూ పూర్తి అయాక ఖమర్ తన తండ్రిని, "గుర్రాన్ని తయారుచేసిన ముసలాడు ఏమయాడు?" అని అడిగాడు.

"వాణ్ణి తలిస్తేనే పాపం! ఏ ఘడియలో వాడు నా కంట పడ్డాడోగాని, నువు నాకు ఎడమైపోయావు. ఎంతెంత పెద్దనేరాలో చేసిన ఖైదీలందరినీ విడుదల చేశానుగాని వాణ్ణిమటుకు చీకటికొట్టులోనే ఉంచాను," అన్నాడు రాజు.

ఖమర్ కోరిన మీదట రాజు ఆ పర్షియన్ విజ్ఞానిని చెర విడిపించి, బట్ట లిచ్చి

సత్కరించాడు. కాని ఆయన తన కుమార్తె ప్రస్తావనమటుకు తీసుకురాలేదు ; ఎందు చేతనంటే ఆ ముసలాడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేసే ఉద్దేశం రాజుకు ఏ కోశానా లేదు. ముసలివాడు మాత్రం రాజకుమారుణ్ణి గుర్రం ఎక్క నిచ్చినందుకు పశ్చాత్తాపపడుతూ లోలోపల కుమిలిపోయాడు. ఇప్పుడు రాజకుమారుడికి ఆ గుర్రం మరల రహస్యం తెలిసిపోయింది.

రాజుకు మటుకు ఆ గుర్రం గురించి ఆందోళనగానే ఉన్నది. ఆయన తన కొడుకుతో, "నాయనా, నువు ఎన్నటికీ ఆ గుర్రం జోలికి పోకుండా ఉండటం మంచిదని తోస్తున్నది. దాన్ని మళ్ళీ ఎక్కవు! దాని కీళ్ళు సగం కూడా నీకు తెలిసి ఉండక పోవచ్చు. అందువల్ల ప్రమాదం ఉన్నది," అన్నాడు.

కాని కమరల్ అక్మార్ తండ్రి అజ్ఞ శిరసావహించలేకపోయాడు.

ఏం జరిగిందంటే, అతను సనారాజు కూతురైన షమ్స్ అల్ నహర్‌ను క్షణం కూడా మరిచిపోలేదు. విందు వినోదాలు జరుగుతూ ఉన్నప్పుడు కూడా ఆమె అతని మనసులో మెదులుతూ ఉన్నది. ఒకనాడు రాజు జంత్రగాత్ర ప్రదర్శనం ఏర్పాటు చేశాడు. ఆ సందర్భంలో ఒక గాయని ప్రేమ గేయం ఒకటి పాడింది. అది వింటుంటే రాజకుమారుడికి భరించరాని విరహబాధ కలిగింది. అతను రాజభవనం మెట్లు ఎక్కి పైకి వెళ్ళి, గుర్రం మీద ఎక్కి కూర్చుని మీట నొక్కాడు. వెంటనే గుర్రం పక్షిలాగా ఆకాశంలోకి లేచిపోయింది.

మర్నాడు ఉదయం చూస్తే రాజకుమారుడి జాడలేదు. రాజభవనం మిద్దె మీద చూస్తే గుర్రం లేదు. ఆ గుర్రాన్ని అప్పుడే విరిచి ముక్కలు చెయ్యనందుకు రాజు ఎంతో పశ్చాత్తాపపడ్డాడు. ఈసారి రాజకుమారుడు తిరిగి రాగానే ఆ గుర్రాన్ని ధ్వంసం చెయ్యాలని ఆయన తీర్మానించుకున్నాడు. కుటుంబంతోపాటు ఆయన మరొకసారి విచారసాగరంలో మునిగిపోయాడు. —(ఇంకా వుంది)



# ఇంగ్లీషువాడి తెలివి

ఒక డచ్చివాడు, ఒక ఫ్రెంచివాడు, ఒక ఇంగ్లీషువాడు స్నేహితులు.

వాళ్ళు ముగ్గురూ కలిసి చావుపడక మీద ఉన్న ఒక స్నేహితుణ్ణి చూడడానికి వెళ్ళారు. అతడు ఈ ముగ్గురు స్నేహితుల్ని చూచి ఎంతో సంబరపడ్డాడు. చివరిసారిగా ఒక కోరిక కోరుకున్నాడు. "నేను చచ్చాక నా శవపేటికలో మీలో ప్రతి ఒక్కరూ ఐదేసి పౌనుల ధనం వేయండి. నా కదే సంతృప్తి!" అన్నాడు.

చావుపడక మీద ఉన్న స్నేహితుడు కన్ను మూశాడు.

డచ్చివాడు శవపేటికలో ఐదు పౌనుల ధనం వేశాడు.

"చచ్చినవాడెలాగూ వచ్చి మార్చుకోడుగదా," అనుకుని ఫ్రెంచివాడు ఐదు పౌన్లకి చెక్కు రాసి శవపేటికలో వేశాడు.

ఇంగ్లీషువాడు యిది చూచాడు. తన చెక్‌బుక్ తీసి పదిహేను పౌనులకు చెక్కు రాసి, అది శవపేటికలో వేసి, డచ్చివాడు వేసిన ఐదు పౌన్లని, ఫ్రెంచివాడు వేసిన చెక్కునీ తీసికొని తన జేబులో భద్రపరుచుకున్నాడు.

—నాగభైరవ కోటేశ్వరరావు





# శత్రువిభజన

వెంకటగిరి అనే గ్రామంలో వీరన్న అనే రైతు ఉండేవాడు. అతనికి నాలుగు ఎకరాల పొలం ఉండేది. అతను కష్టపడి పని చేసి, అందులో వచ్చే ఆదాయంతో తన కుటుంబాన్ని పోషించుకునేవాడు.

ఒక ఏడు వర్షాలు లేక కరువు వచ్చి, ఆ ప్రాంతంలో దొంగల బెడద ఎక్కువయింది. కాని మరుసటేడు వర్షాలు పడి, పైర్లు పచ్చగా పెరిగాయి.

వీరన్న పొలంలో జొన్న బాగా పండింది. వీరన్న రాత్రిళ్ళు పొలానికి కాపలా కాస్తున్నాడు. ఒక రాత్రి అతను తన గుడిసెలో పడుకుని కునుకుతూ ఉండగా చేనులో చప్పుడయింది. దొంగలై ఉంటా రనుకుని వీరన్న కర్ర తీసుకుని, కంబళి కప్పుకుని బయలుదేరాడు.

అల్లంత దూరంలో నలుగురు దొంగలు చేనులో ప్రవేశించి కంకులు కోస్తూ ఉండటం అతని కంట బడింది. వెన్నెలలో అతను ఆ దొంగలను పోల్చుకున్నాడు. వాళ్ళు అతని గ్రామానికి చెందినవాళ్ళే. వాళ్ళు నలుగురూ, తాను ఒక్కడే! కర్ర తీసుకుని వారి పైకి పోవటం తనకే ప్రమాదం.

ఏం చెయ్యాలా అనుకుంటూ ఉండగా అతనికి ఒక ఆలోచన వచ్చింది. అతను కర్రను అక్కడే వదిలేసి, నిర్భయంగా దొంగలను సమీపించాడు.

వీరన్న చేనులో దొంగతనంగా రాత్రివేళ జొరబడి కంకులు విరుస్తున్న నలుగురిలో ఒకడు బ్రాహ్మడు, ఒకడు కోమటి, ఒకడు క్షత్రియుడు, నాలుగోవాడు నాగన్న అనే పేద రైతు.

వీరన్న బ్రాహ్మణ్ణి సమీపించి నమస్కారం చేసి, "స్వామీ, మీరు అర్ధ రాత్రి వేళ రావాలా? కాకి చేత కబురు పంపితే

వి. లక్ష్మణరావు



మీకు కావలిసిన జొన్న కంకులు నేనే కోసి తెచ్చి ఇంటి దగ్గిర ఇద్దును కద! మీరు నిశ్చింతగా కోరినన్ని కంకులు కోసుకోండి," అన్నాడు.

బ్రాహ్మడు పొంగి పోయి, తనకే మీ భయం లేదనుకున్నాడు.

తరవాత వీరన్న క్షత్రియుడి వద్దకు వెళ్ళి, "రామరాజుగారూ, తమరు మాకు ప్రభువులు. అందుచేత ఈ పొలం మీదే. మీరు ఎన్ని కంకులు కోసుకుంటే మటుకు అడిగే వాడెవడు?" అన్నాడు.

ఈ మాటవిని క్షత్రియుడు తనకు కూడా భయం లేదను కుని, నిశ్చింతగా కంకులు కోయసాగాడు.

వీరన్న కోమటి వద్దకు వెళ్ళి, "శ్రేష్ఠి గారూ, మా బతుకులు మీ మీదే ఆధారపడి ఉన్నాయి. సమయానికి అప్పులూ, సప్పులూ ఇచ్చి ఆదుకుంటూ ఉంటారు. మీకు అడ్డేమిటి? మీ చిత్తం వచ్చినన్ని కంకులు కోసుకోండి," అన్నాడు.

ఈ మాటలతో కోమటికి కూడా భయం తీరిపోయింది.

వీరన్న రైతును సమీపించి, "ఒరే, నాగన్నా, ఈ ముగ్గురికీ మనబోటి వాళ్ళం దానంగానో, పన్నురూపంలోనో, బాకీకి వడ్డీ రూపంలోనో ఇచ్చుకోవలిసిన వాళ్ళం. కాని నువు సాటి రైతువై ఉండి, ఈ పని చెయ్యటం ఏమీ బాగాలేదు. పద ఘా అమ్మ దగ్గిరికి, నీకు ఆవిడ ఏం తీర్పు చెబుతుందో చూస్తాం," అని నాగన్నను రెక్క పట్టుకుని తన గుడిసెకు ఈడ్చుకు పోయాడు. మిగిలిన ముగ్గురూ నాగన్నను ఏవిధంగానూ ఆదుకోలేదు. వీరన్న పొలంలో పడి దొంగతనం చెయ్యటానికి తమ ముగ్గురికీ హక్కు ఉన్నదిగాని, నాగన్నకు లేదని వాళ్ళకు నమ్మకం కుదిరింది.

వీరన్న కొంచెంసేపటికి తిరిగి వచ్చి బ్రాహ్మణ దొంగతో, "అయ్యా, మా అమ్మ అంటున్నది గదా, బ్రాహ్మడు దానం ఇస్తే పుచ్చుకోవచ్చు గాని, దొంగిలించటం తప్పే అంటున్నది. మీరు ఒకసారి ఆవిడ దగ్గిరికి

రండి!'' అంటూ బ్రాహ్మడి చెయ్యి పట్టుకున్నాడు.

''పద, మీ అమ్మ అనుమతితోనే కంకులు కోసుకుంటాను,'' అంటూ బ్రాహ్మడు వీరన్న వెంటవెళ్ళాడు.

కొద్దిసేపట్లో వీరన్న మళ్ళీ తిరిగి వచ్చి కోమటితో, ''అయ్యా, సెట్టిగారూ! మీరు మాకు ఏనాడూ అప్పులిచ్చి ఆదుకోలేదని మా అమ్మ అంటున్నది. మీరు కంకులు కొయ్యటం తప్పట. వచ్చి సంజాయిషీ చెప్పుకోండి,'' అంటూ చెయ్యి పట్టుకున్నాడు.

కోమటి క్షత్రియుడి కేసి దీనంగా చూశాడు. కాని క్షత్రియుడు అతన్ని ఆదుకునే ధోరణిలో లేడు.

ఈసారి వీరన్న కర్రతో సహా వచ్చాడు. అప్పటికి క్షత్రియుడు తాను కోసిన కంకులన్నీ మూట గట్టుకున్నాడు. అతను వీరన్ననూ, అతని చేతిలోవున్న కర్రనూ చూడగానే జొన్నకంకుల మూట ఎత్తుకుని పారిపోసాగాడు.

వీరన్న క్షత్రియుడి వెంటబడి కర్రతో బాదాడు. ఆ దెబ్బకు క్షత్రియుడు కింద పడిపోయి, వీరన్నకు చిక్కాడు. వీరన్న అతని చేతులు అంటగట్టి, ''మిగిలిన ముగ్గురూ దొంగతనం చేస్తూ ఉంటే శిక్షించవలిసినవాడివి, నువు కూడా వాళ్ళతో చేరి దొంగతనం చేస్తావా? ఈ నేరానికి నువు శిక్ష పొందవలిసి ఉంటుంది,'' అన్నాడు.

''నన్ను కూడా మీ అమ్మ దగ్గిరికి తీసుకుపో. మిగిలిన ముగ్గురినీ క్షమించిన మీ అమ్మ నన్ను మాత్రం క్షమించదా?'' అన్నాడు క్షత్రియుడు.

వీరన్న నవ్వి, ''మా అమ్మ ఎవరనుకున్నావు? ఈ భూదేవే! ఆమె పక్షానే నేను నిన్ను బంధించాను. మిగిలిన ముగ్గురిని కూడా నా గుడిసెలో కట్టి పడేశాను,'' అన్నాడు.

అతను చుట్టుపట్ల రైతులందరినీ కేకేసి, వారంతా రాగానే జరిగినదంతా చెప్పి, తెల్లవారగానే దొంగలందరినీ న్యాయస్థానానికి పంపేశాడు.





# వ్యర్థమైన ఖర్చు

పూర్వం సారత్‌పూర్ అనే చిన్న గ్రామంలో రామసింహుడు అనే షావుకారు ఉండేవాడు. అతనికి డబ్బు ఖర్చు పెట్టటమంటే చాలా అయిష్టం. తనకోసం కూడా ఎక్కువ ఖర్చు పెట్టుకునేవాడు కాదు.

ఒకనాడు అతడు ఏదో పనిమీద పొరుగూరికి పోతూండగా దారిలో ఒక ఖర్జూరపు చెట్టు కనబడింది. దానినిండా గుత్తులు గుత్తులుగా ఖర్జూరపు పళ్ళున్నాయి. రామసింహుడికి చిన్నప్పటి నుంచీ ఖర్జూరపు పళ్ళంటే చాలా ఇష్టం. ఇప్పుడు వాటిని చూస్తూంటే అతనికి నోరూరింది. అతనికి చెట్టు ఎక్కటం రాదు. కాని చూస్తూ చూస్తూ ఖర్జూరపు పళ్ళను వదిలి ముందుకు సాగిపోవటానికి మనస్కరించక, అతను ఎలాగో కష్టపడి చెట్టు ఎక్కాడు.

రామసింహుడు తిన్నన్ని పళ్ళు తిని, మరికొన్ని జేబులో వేసుకుని, చెట్టు దిగ వద్దామని కిందికి చూసేసరికి, నేల ఎక్కడో పాతాళంలో ఉన్నట్టు కనబడి, కళ్ళు తిరిగి, కింద పడిపోతానని భయం పుట్టింది. ఆ భయంలో అతను భగవంతుణ్ణి తలుచుకుని, "స్వామీ, నేను క్షేమంగా కిందికి దిగితే వెయ్యి మందికి సంతర్పణ చేయిస్తాను." అని మొక్కుకున్నాడు.

అలా మొక్కుకున్న మీదట కొంత ధైర్యం వచ్చి అతను చెట్టు దిగ నారంభించాడు. కొంత దిగినాక కిందికి చూస్తే ప్రమాదం కొంత తక్కువగా ఉన్నట్టు తోచింది. అందుచేత రామసింహుడు, "వెయ్యి మందికి కాకపోయినా అయిదు వందల మందికి సంతర్పణ చెయ్యక తప్పదు. ఇది దేవుడితో కూడిన విషయం," అనుకున్నాడు.

ఇంకా కొంచెం దిగినాక అతనికి అయిదు వందల మందికి సంతర్పణ చెయ్యటం

జి. యస్. శ్రీనాథశర్మ

చాలా అనవసరమని తోచింది; ఒక వంద మందికి చేస్తే చాలుననిపించింది.

చివరకు అతను క్షేమంగా చెట్టు దిగి, "అయిదు వందల మంది అలగా జనానికి సంతర్పణ చెయ్యటం ఒక సద్బ్రాహ్మణుడికి సంతర్పణ చెయ్యటంతో సమానం. అందుచేత ఒక సద్బ్రాహ్మణుడికి విందు చేస్తాను," అనుకున్నాడు.

అతను ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు ఏ బ్రాహ్మణుడికి సంతర్పణ చెయ్యటమా అని ఆలోచించాడు. లావుగా ఉండే బ్రాహ్మణులు ఎక్కువ తింటారు. కాని తమ గ్రామంలో బక్క బ్రాహ్మణు లెవరున్నారు? రామాలయ పూజారి రామశాస్త్రి చాలా బక్కగా ఉంటాడు! అందుచేత అతన్ని విందుకు పిలవ నిశ్చయించి, రామసింహుడు పూజారి ఇంటికి వెళ్ళి, ఆయనను మర్నాడు తమ ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు.

పిసినారి తనానికి పేరు మోసిన రామసింహుడు అకారణంగా తనను భోజనానికి పిలవటం చూసి రామశాస్త్రి అమిత ఆశ్చర్య పడుతూ, అలాగే వస్తానన్నాడు.

రామసింహుడు తిన్నగా ఇంటికి వెళ్ళి తన భార్యతో, "ఇవాళ వెళ్లిన పని కాకుండానే ఇంటికి తిరిగి రావలసి వచ్చింది. రేపు మళ్ళీ వెళ్ళాలి. పూజారి రామశాస్త్రిని భోజనానికి పిలిచాను. సాధ్యమైనంత తక్కువ ఖర్చులో



అంతా జరిగేటట్టు చూడు." అని ఆ రోజు జరిగిన సంగతి ఆమెకు చెప్పాడు.

మర్నాడు ఉదయమే రామసింహుడు పొరుగూరికి ప్రయాణమై వెళ్ళాడు.

భోజనాలవేళకు రామశాస్త్రి రామసింహుడి ఇంటికి వచ్చాడు. రామసింహుడి భార్య ఆయనకు వడ్డన చేసింది. బక్కగా ఉన్నా రామశాస్త్రి మంచి తిండి పుష్టికలవాడు. ఆయన ముగ్గురు తిన్నంత తిని, తాను తినగా మిగిలిపోయిన పిండివంటలు మూటగట్టుకుని, తాంబూలం పుచ్చుకున్నాడు. అందులో దక్షిణ లేదు.

"అమ్మా, సంతర్పణ చేసిన బ్రాహ్మడికి దక్షిణలేని తాంబూలం ఇవ్వటం గృహస్థుకు

మంచిది కాదు. ఇందులో రెండు బంగారు కాసులు పెట్టు,'' అన్నాడు రామశాస్త్రి రామసింహుడి భార్యతో.

చేసేది లేక ఆమె రెండు బంగారు కాసులు తెచ్చి రామశాస్త్రి కిచ్చింది.

ఇది జరిగిన మర్నాడు రామసింహుడు ఇంటికి తిరిగి వచ్చాడు. బ్రాహ్మణ సంతర్పణ ఎలా జరిగిందో, ఎంత ఖర్చు అయిందో భార్య భర్తకు చెప్పింది. రామసింహుడి గుండె బద్దలయినంత పని అయింది. అతను భార్యను తిట్టి, "నిన్ను పిచ్చిముండను చేసి ఇల్లు దోచుకుపోయిన ఆ దొంగవెధవ పని పట్టుతాను,'' అంటూ కర్ర తీసుకుని రామశాస్త్రి ఇంటికి బయలుదేరాడు.

ఇలాటి దేదో జరగబోతుందని రామశాస్త్రి ముందే ఊహించి ఉండటం చేత తగిన ఏర్పాట్లన్నీ చేసుకుని ఉన్నాడు. రామసింహుడు తన ఇంటికి వస్తున్నజాడ పొడగట్టగానే ఆయన మంచం మీద పడుకున్నాడు. ఆయన భార్యా, కొడుకూ మంచం దగ్గిర చేరి ఏడుస్తున్నారు.

అక్కడికి వచ్చిన రామసింహుణ్ణి చూసి రామశాస్త్రి కొడుకు, "ఎంత పని చేశారండీ! భోజనానికని పిలిచి మా నాయనకు ఏం పెట్టారో ఏమోగాని, ఇంటికి వస్తూనే వాంతులు చేసుకుని, మంచాన పడిఉన్నాడు. వైద్యుణ్ణి పిలిస్తే, విషప్రయోగం జరిగింది, విరుగుడుకు నాలుగు బంగారు కాసులు ఖర్చవుతుంది అన్నాడు. ఈ సంగతి ఏమిటో తేల్చుకుందాం, గ్రామపెద్దల దగ్గిరికి పోదాం రండి,'' అన్నాడు.

గ్రామపెద్దలు వైద్యం ఖర్చుతో వదలక, జరిమానాలూ అవీ వేస్తారు. ఆ భయంతో రామసింహుడు, "బాబూ, వైద్యానికయే డబ్బు నేను ఇచ్చుకుంటాను. నన్ను వదిలి పెట్టు,'' అని రామశాస్త్రి కొడుకును బతిమాలుకున్నాడు.

రామశాస్త్రి కొడుకు రామసింహుణ్ణి దయ తలచినట్టు నటిస్తూ నాలుగు బంగారు కాసులు పుచ్చుకుని, పంపేశాడు.

అటు తరవాత రామసింహుడికి ఖర్జూర పళ్ళు గుర్తుకొస్తే గుండె దడదడ లాడేది.



# శెట్టి తెలివి

ఒక నగరంలో ఆదిశెట్టి అని తెలివైన వర్తకుడు ఉండేవాడు. అతను రాజుగారికి స్నేహ పాత్రుడుగా ఉండి, రోజూ కొలువుకు వెళ్ళివస్తూ ఉండేవాడు.

ఒక రాత్రి పొద్దుపోయి ఆదిశెట్టి ఇంటికి వచ్చి, అటక మీద దొంగ ఎక్కి ఉండటం గమనించాడు. ఆయన భార్యతో, "ఏమే, నగరంలో దొంగతనాలు జాస్తిగా ఉన్నాయి. నీ వంటి మీది నగలన్నీ తీసి ఇయ్యి, పెట్టెలో దాస్తాను," అన్నాడు.

నిజమేననుకుని శెట్టిభార్య తన నగలన్నీ తీసి భర్త కిచ్చింది. అతను వాటిని పెట్టెలో పెట్టుతూ, "అమ్మో! బాబో! తేలుకుట్టిందే!" అంటూ గట్టిగా అరవటం మొదలు పెట్టాడు.

ఏం జరిగిందోనని చుట్టుపక్కల వాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చి, "ఏం జరిగింది?" అని అడిగారు.

"మీరంతా నా కేకలు విని వచ్చారు గాని, ఆ అటక మీది దొంగ దిగాడేమో చూడండి," అన్నాడు ఆదిశెట్టి.

దొంగ దొరికిపోయాడు.

—కొవ్వూరి కృష్ణారెడ్డి





# మంత్రి అవినీతి

ధర్మపురంలో ఒక రత్నవర్తకుడు ఉండేవాడు. ఆయన న్యాయపరుడూ, నిజాయితీపరుడూనూ. అందుచేత వర్తకంలో ఆయనతో ఎప్పుడూ ఎవరికీ ఎలాంటి పేచీగాని ఉండేదికాదు. ఆయనను అందరూ విశ్వసించేవారు.

ఒకరోజు ఒక పెద్దమనిషి రత్నవర్తకుడి వద్దకు ఒక రత్నాలహారం తెచ్చి, దానిని అయిదువందల బంగారు నిష్కాలకు అమ్మిపెట్టమని కోరాడు. రత్నవర్తకుడు సరేనన్నాడు.

తరవాత ఆయన తన వద్దకు బేరానికి వచ్చే వారందరికీ ఆ హారాన్ని చూపుతూ వచ్చాడు.

ఒకనాడు శేఖరుడనే మంత్రి రత్నవర్తకుడి వద్దకు ఏదో పనిమీద వచ్చి రత్నాల హారాన్ని చూసి, పొంగిపోతూ, "చాలా బాగున్నది. ఇంత పనితనం నేనెక్కడా చూడలేదు. ఇది మీకు ఎలా వచ్చింది?" అని అడిగాడు.

శేఖరమంత్రి లోభీ, నీచుడూ, అవినీతిపరుడూ అని తెలిసి కూడా రత్నవర్తకుడు, "ఒక పెద్దమనిషి దీనిని అయిదువందల బంగారు నిష్కాలకు అమ్మిపెట్టమని నన్ను కోరాడు. బేరానికి వచ్చినవారందరికీ చూపుతున్నాను," అన్నాడు.

"అయిదు వందలా! నాలుగు వందలకైతే నాకు తీసుకోవాలనే ఉన్నది," అన్నాడు శేఖరుడు.

"అది సాధ్యం కాదు. ఆ పెద్దమనిషి కోరినది అయిదువందలు," అన్నాడు రత్నవర్తకుడు.

"అలా అయితే మా ఇంటికి ఒకసారి వస్తారా? నా భార్యకు ఈ హారం నచ్చితే అయిదువందలకే కొంటాను," అన్నాడు శేఖరుడు.

పి. నాగభూషణం

ఆయన మాట నమ్మి రత్నవర్తకుడు హారం తీసుకుని మంత్రిగారి వెంట ఆయన ఇంటికి వెళ్ళాడు.

"ఆ హారం ఇలా ఇచ్చి, మీరు ఇక్కడే కూర్చోండి. దీన్ని నా భార్యకు చూపిస్తాను." అంటూ శేఖరుడు రత్నవర్తకుణ్ణి వెలుపలి వసారాలో కూర్చోబెట్టి, తాను లోపలికి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

రత్నవర్తకుడు ఎంతో ఓర్పుగా గంటల తరబడి అక్కడే కూర్చున్నాడు. కాని మంత్రి బయటికి రాలేదు. రత్నవర్తకుడు రెండు మూడుసార్లు తలుపు తట్టాడుగాని ఎవరూ పలకలేదు.

చివరకు ఆయన బరువెక్కిన గుండెతో తన ఇంటికి తిరిగి వచ్చేశాడు. ఆ రాత్రి ఆయన కన్ను మూయలేదు. ఆ పెద్ద మనిషి ఏదో ఒక రోజున వచ్చి తన హారం గురించి అడిగితే తాను ఏమని చెప్పాలో ఆయనకు తోచలేదు.

మర్నాడు తెల్లవారగానే ఆయన మంత్రిగారి ఇంటికి వెళ్ళేసరికి మంత్రి రాజసభకు బయలుదేరుతున్నాడు.

"ప్రభూ, తమరు రత్నాలహారం కొనటం గురించి ఏమి నిర్ణయించారు? తమరు కొనకపోతే దాన్ని నాకు తిరిగి ఇచ్చినట్టయితే మరొకరికి అమ్ముతాను," అన్నాడు రత్నవర్తకుడు.




"మీరు ఏ హారం గురించి మాట్లాడుతున్నారో నాకు బోధపడలేదు," అన్నాడు మంత్రి.

"తమరు నిన్న తమ దేవిగారికి చూపిస్తామని నా దగ్గిర తీసుకున్న రత్నాలహారం గురించే మాట్లాడుతున్నాను," అన్నాడు రత్నవర్తకుడు.

"ఏమిటి నువ్వనేది? నీకేమన్నా మతి పోయిందా ఏం? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? పిచ్చి పిచ్చిగా మాట్లాడితే అనుభవించగలవు. దయచెయ్యి!" అని మంత్రి హుంకరించాడు.

రత్నవర్తకుడు ప్రమాదం గుర్తించాడు; ఆ హారం మంత్రి నుంచి తిరిగి రాదని

గ్రహించాడు; తిన్నగా న్యాయస్థానానికి వెళ్ళి, న్యాయాధికారితో జరిగిన దంతా వివరించి చెప్పాడు.

న్యాయాధికారికి రత్నవర్తకుడి నిజాయితీ తెలుసును, మంత్రి దుష్టబుద్ధి అని కూడా తెలుసును. అందుచేత ఆయన రత్నవర్తకుడి మాటలు పూర్తిగా నమ్మి, ''ఆ రత్నాల హారాన్ని తిరిగి తెప్పించటానికి ప్రయత్నిస్తాను,'' అని మాట ఇచ్చాడు.

మర్నాడు న్యాయాధిపతి తన ఇంట విందుచేసి, రాజుగారి కొలువులో ఉన్న అందరినీ ఆహ్వానించాడు. న్యాయనిర్ణయం విషయంలో తన తలకు మించిన సమస్య ఏర్పడినప్పుడల్లా ఆయన ఇలాటి విందులు చేసి ప్రముఖులను సంప్రతించుతూ ఉంటాడు.

ఆహూతులు వచ్చే ముందు న్యాయాధిపతి తన సేవకుడితో, ''శేఖరమంత్రిగారు రాగానే నువ్వు ఏం చెయ్యాలంటే, ఆయన పాదరక్ష ఒకటి తీసుకుని, వారి ఇంటికి వెళ్ళి, వారి భార్యతో, మంత్రిగారు రత్నాల హారాన్ని అందరికీ చూపించాలనుకుంటున్నారు, దాన్ని తెమ్మన్నారు అని చెప్పు. ఆవిడ గుర్తు అడిగితే మంత్రిగారి పాదరక్ష చూపు. నువు ఫలాని ఇంటి నౌకరువని చెప్పు. ఆమె హారం ఇస్తారు. నేను అడిగిన దాకా దాన్ని నీ వద్దనే ఉండనీ,'' అని చెప్పాడు.

నౌకరు వసారాలోకి వెళ్ళి, మంత్రిగారు వదిలిన పాదరక్షల్లో ఒకటి తీసుకుని, మంత్రిగారి ఇంటికి వెళ్ళి, తన యజమాని చెప్పినట్టే చెప్పి, రత్నాలహారం తెచ్చాడు.

అతిథులందరూ వెళ్ళిపోయాక న్యాయాధికారి తన సేవకుడి నుంచి రత్నాలహారాన్ని తీసుకుని, రత్నవర్తకుణ్ణి పిలిపించి హారాన్ని ఇస్తూ, ''వంచనతో పోయిన దాన్ని వంచనతోనే తిరిగి సంపాదించ వలసి వచ్చింది,'' అన్నాడు.

రత్నాలహారాన్ని తిరిగి కళ్ళజూడగానే రత్నవర్తకుడికి ప్రాణం లేచివచ్చింది. ఆయన న్యాయాధికారికి తన కృతజ్ఞత ఎంతగానో తెలుపుకుని వెళ్ళిపోయాడు.






కృష్ణుడు వస్తున్నాడని హస్తినాపురంలో తెలియగానే ధృతరాష్ట్రుడు భీష్మద్రోణులనూ, సంజయ విదురులనూ, దుర్యోధనుణ్ణీ అతని మంత్రులనూ పిలిపించి, "కృష్ణుడు ఇక్కడికి వస్తున్నాడట. ఊళ్ళో అందరూ వింతగా చెప్పుకుంటున్నారు. అతనికి దారిలో అన్ని సదుపాయాలూ ఏర్పాటు చెయ్యండి. అతనికి రకరకాల సత్కారాలు చెయ్యండి," అన్నాడు.

దుర్యోధనుడు హస్తినాపురం నుంచి వృకస్థలం దాకా దారి అంతా అలంకరింపజేసి, అక్కడక్కడా సభలు నిర్మింపజేశాడు. కృష్ణుడు ఆ అలంకరణలనూ, సభలనూ చూడకుండానే హస్తినాపురం చేరాడు. దుర్యోధనుడు తప్ప మిగిలిన ధృతరాష్ట్రుడి కొడుకులూ, భీష్మద్రోణాదులైన పెద్దలూ రథాల మీద అతనికి ఎదురు వెళ్ళారు.

కృష్ణుడు ధృతరాష్ట్రుడి మందిరం ముందు రథం దిగి, కాలి నడకన మూడు కక్ష్యలు దాటి, ధృతరాష్ట్రుడి కొలువు కూటం ప్రవేశించాడు. అతను సభలోకి అడుగుపెట్టగానే ధృతరాష్ట్రుడితో సహా అందరూ లేచి నిలబడ్డారు. కృష్ణుడు ముందు భీష్ముణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ కుశల ప్రశ్నలతో గౌరవించి, మిగిలిన రాజులందరినీ వయసువారీగా పలకరించాడు. అతను కూర్చోవటానికి ధృతరాష్ట్రుడు బంగారు ఆసనం తెప్పించి వేయించాడు. కృష్ణుడు అక్కడ అతిథిసత్కారాలన్నీ పొంది, కొంత

**48. కృష్ణరాయబారం - 2**



సేపు కబుర్లతో కాలక్షేపం చేసి, అక్కడి నుండి విదురుడి ఇంటికి వెళ్ళాడు.

ఆ రోజు మధ్యాహ్నం కృష్ణుడు కుంతీదేవిని చూడటానికి ఆమె ఇంటికి వెళ్ళాడు. కుంతీదేవి కృష్ణుడి కంఠం కౌగలించుకుని, తన కొడుకులను తలుచుకుని ఏడ్చింది. ఆమె అతనికి తగిన సత్కారాలు చేసి కూర్చోబెట్టి, "కృష్ణా, నా కొడుకులు నన్నిక్కడ వదిలి, అరణ్యాలకు వెళ్ళారు. నా శరీరం ఇక్కడ ఉన్నదేగాని, నా మనసు వాళ్ళవెంటే ఉన్నది. తండ్రి లేని ఆ బిడ్డలను నేను ఎంతో గారాబంగా పెంచాను. భయంకరమైన అరణ్యాలలో వాళ్ళు ఎలా జీవించారో? ధర్మరాజు ఎవరూ, ఎన్నడూ మోయనంత ధర్మభారాన్ని మోస్తున్నాడు. అతను ఎలా ఉన్నాడు? క్షేమంగా ఉన్నాడా? భీముడు కులాసాగా ఉన్నాడా? అర్జునుడు కులాసాగా ఉన్నాడా? సహదేవుడు ఎలా ఉన్నాడు? వాడు నాకు ఎన్నివిధాల సేవలు చేసేవాడు! నకులుడు క్షేమమా? వాణ్ణి నేను మళ్ళీ చూస్తానా? నాకు కొడుకుల కన్న ప్రియమైనది ద్రౌపది ఎలా ఉన్నది? అంత మంచి మనిషి కష్టాలు పడిందంటే పుణ్యాత్ములు సుఖపడతారని ఎలా నమ్మటం?" అన్నది.

కృష్ణుడు కుంతీదేవిని ఊరడించి, "నీ కొడుకులూ, కోడలూ నీకు కనిపిస్తారు. శత్రువులను జయించి వారు నీ దగ్గిరికి వస్తారు," అన్నాడు. తరవాత అతను కుంతీదేవి వద్ద సెలవు తీసుకుని దుర్యోధనుడి వద్దకు వెళ్ళాడు.

దుర్యోధనుడి ఇల్లు ఇంద్రభవనం లాగున్నది. దాని పైఅంతస్థులో దుర్యోధనుడు రత్నసింహాసనం మీద కూర్చుని ఉన్నాడు. అతని సమీపంలో దుశ్శాసన, కర్ణ, శకునులు కూర్చుని ఉన్నారు. ఇంకా అక్కడ అనేకమంది కౌరవులూ, ఇతర రాజులూ ఉన్నారు. కృష్ణుడు రాగానే అందరూ లేచి నిలబడి మర్యాదచూపారు. కృష్ణుడు అందరితోనూ కుశలప్రశ్నలు చేసి, ఎవరికి తగినట్టు వారిని పరామర్శించి, తన



కోసం ప్రత్యేకంగా వేసిన ఆసనం మీద కూర్చున్నాడు. దుర్యోధనుడు కృష్ణుణ్ణి తన ఆతిథ్యం స్వీకరించమన్నాడు. అందుకు కృష్ణుడు ఒప్పుకోలేదు.

"మా రెండు పక్షాలకూ సహాయపడ్డావు గదా. మేము ప్రేమతో ఇచ్చే ఆతిథ్యం నిరాకరించటానికి కారణ మేమిటి?" అని దుర్యోధనుడు కృష్ణుణ్ణి అడిగాడు.

"నేను దూతగా వచ్చిన వాణ్ణి. నేను వచ్చిన పని నెరవేరితే నిరభ్యంతరంగా మీరిచ్చే ఆతిథ్యాన్ని స్వీకరిస్తాను," అన్నాడు కృష్ణుడు.

"మమ్మల్ని గురించి నువు అపోహలు పెట్టుకోరాదు. నువు వచ్చిన పని నెరవేరినా, నెరవేరకపోయినా కూడా నీకు ఆతిథ్యం ఇవ్వటం మా విధి. అందుచేత నువు మా ఆతిథ్యం స్వీకరించి తీరాలి," అని దుర్యోధనుడు మళ్ళీ అన్నాడు.

కృష్ణుడు నవ్వి, "ఇష్టమున్నవారితోనూ, ఆపదలో ఉన్నప్పుడూ భోజనం చెయ్యవచ్చు. దుర్యోధనా, నీకు మా పట్ల ప్రీతి లేదు, మేము ఆపదలలోనూ లేము. మాకూ మీకూ మధ్యవైరం ఉన్నది గనక నువు నాకు ఆతిథ్యం ఇవ్వరాదు, నీ ఆతిథ్యం నేను పుచ్చుకోనూ రాదు. నీకు పాండవుల మీద అకారణవైరం ఉన్నది. వారేమో నాకు ప్రాణాలవంటివారు. వారివల్ల ఒక్క అధర్మంగాని జరిగినట్టు ఎవరూ చెప్పలేరు. వారిని ద్వేషిస్తున్నావంటే నన్నూ ద్వేషిస్తున్నట్టే! అందుచేత నీ ఆతిథ్యం స్వీకరించమని నన్ను ఒత్తిడి చెయ్యకు," అని చెప్పి, అక్కడి నుండి బయలుదేరి, ద్రోణుడూ, కృపుడూ, భీష్ముడూ మొదలైనవారు వెంట రాగా, విదురుడి ఇంటికి వెళ్ళాడు.

తన వెంట వచ్చిన వారి నందరినీ వారి వారి ఇళ్ళకు పంపి, కృష్ణుడు విదురుడి ఇంట భోజనం చేశాడు. భోజనానంతరం కృష్ణుడితో విదురుడు, "కృష్ణా, నువు ఇక్కడికి రావటం అంత మంచిది కాదని నాకు తోస్తున్నది. దుర్యోధనుడు అన్ని ధర్మాలనూ అతిక్రమించాడు. అతని



మనస్సు యుద్ధం మీదే ఉన్నది గాని, శాంతి మీద లేదు. కర్ణుడు ఒక్కడే పాండవ బలాలన్నిటినీ గెలుస్తాడను కుంటున్నాడు గనక అతను శాంతికి ఒప్పుకోడు. అతనికి సైనిక బలం కూడా చాలాహెచ్చుగా ఉన్నది. అందుచేత నువు ఏమి చెప్పినా అతని తలకు ఎక్కదు. అతనికి అండగా వచ్చిన రాజులలో నీకు శత్రువులు చాలామంది ఉన్నారు. వాళ్ళమధ్యకు నువు వెళ్ళటం నా కెంత మాత్రమూ ఇష్టం లేదు. నీ మీది అభిమానంతో చెప్పానుగాని, నీ ప్రభావమూ, పౌరుషమూ తెలీక కాదు," అన్నాడు.

దానికి కృష్ణుడు విదురుడితో, "స్నేహితుడు చెప్పదగిన మాట చెప్పావు. నువ్వన్నట్టు జరుగుతుందని తెలిసే నేను వచ్చాను. అయినా శాంతి కోసం శాయశక్తులా ప్రయత్నించి, ఉభయపక్షాలకూ నాశనం కలగకుండా చూడటం నా ధర్మం, లేకపోతే, సర్వనాశనం జరుగుతూ ఉంటే కృష్ణుడు చూస్తూ ఊరుకున్నాడన్న మాట వస్తుంది. నాకు వచ్చిన భయం ఏమీ లేదు," అని చెప్పి, ఆ రాత్రి విదురుడి ఇంటనే నిద్రచేశాడు.

మర్నాడు ఉదయం కృష్ణుడు నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని, స్నానం చేసి, సంధ్యావందనం చేస్తూ ఉండగా దుర్యోధనుడూ, శకునీ వచ్చి, ధృతరాష్ట్రుడు సభలో ఉన్నాడనీ, కృష్ణుడి రాకకోసం ఎదురు చూస్తున్నాడనీ తెలిపారు.

ఇంతలో కృష్ణుడి సారథి అయిన దారుకుడు రథం సిద్ధంగా ఉన్నదని చెప్పాడు. కృష్ణుడు తన రథంలో విదురుణ్ణి ఎక్కించుకుని బయలుదేరాడు. దుర్యోధన, శకునులు తమ రథంలో బయలుదేరారు. వారి వెంట ఇంకా అనేకమంది రాజులు ఏనుగుల మీదా, గుర్రాల మీదా వచ్చారు. వీరితో బాటు చాలామంది పౌరులుకూడా ఊరేగింపులో చేరారు. ఇలా పెద్ద బలగంతో రాజవీధి వెంబడి ధృతరాష్ట్రుడి సభకు వెళ్ళే కృష్ణుణ్ణి వీధుల వెంబడి నిలబడి స్త్రీలూ, పిల్లలూ, వృద్ధులూ చూశారు.



సభాద్వారం దగ్గిర కృష్ణుడు తన రథం దిగి, ఒక చేత్తో విదురుణ్ణీ, మరొక చేత్తో సాత్యకిని పట్టుకుని సభలోకి ప్రవేశించాడు. కృష్ణుడికి ముందుగా కర్ణ దుర్యోధనులూ, అతని వెనకగా కృతవర్మ మొదలైన వృష్ణి వీరులూ సభా ప్రవేశం చేశారు. సభలోని వారంతా కృష్ణుడికి తగిన గౌరవమర్యాదలు చూపారు. అతను తన కోసం సిద్ధంగా ఉంచిన ఆసనం మీద కూర్చున్నాడు. అతనికి దగ్గిరలోనే కర్ణుడూ, దుర్యోధనుడూ ఒకే ఆసనం మీద కూర్చున్నారు. విదురుడు కృష్ణుడి పక్కనే మరొక ఆసనంమీద కూర్చున్నాడు. నిశ్శబ్దంగా ఉన్న సభలో కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు:

"రాజా, వీరులందరూ నాశనం కాకుండా కౌరవ పాండవుల మధ్య శాంతి సాధించమని నిన్ను యాచించటానికి నేను ఇక్కడికి వచ్చాను. మేలు చేకూరే మార్గాలు నీకు ఒకరు చెప్పనవసరం లేదు. అన్ని రాజ వంశాలకూ అగ్రస్థానంలో కురుకులం ఉన్నది. కౌరవులకు నువు ముఖ్యుడివి. ఎవరు ఏ తప్పుచేసినా నువు శిక్షించగలవు. దుర్యోధనుడు మొదలైన నీ కొడుకులు ధర్మమూ, అర్థమూ విడిచిపెట్టి, మర్యాదలన్నీ మంటగలిపి అనేక దుష్కార్యాలు చేస్తున్నారు. ఇది నువు తెలుసుకోవాలి. రానున్న ఆపదకు కౌరవులే కారణభూతులు. ఈ ఆపదను నివారించకపోతే భూమి మీద గల ప్రజలందరికీ నాశనం గలుగుతుంది. ఈ ఆపదను తప్పించే శక్తి నీలో ఉన్నది. కౌరవ పాండవుల మధ్య శాంతి కలిగించటం కష్టం కాదని నా నమ్మకం. అది నీ చేతిలోనూ, నా చేతిలోనూ ఉన్నట్టిదే. నువు నీ కొడుకులను సన్మార్గానికి తిప్పు, నేను పాండవుల కోపాగ్నిని చల్లార్చుతాను. నీ కొడుకులనూ, నీ కులంవారినీ శాసించే హక్కు నీ కున్నది. వారిని శాసించి, వారికీ, పాండవులకూ సంధి చెయ్యి. పాండవులను జయించటం ఎవరితరమూ కాదు. వారు నీకు అండగా ఉండగా నిన్ను జయించటం ఎవరితరమూ కాదు. నువు ప్రపంచాన్ని



అంతనూ శాసించగలుగుతావు. పాండవులతో సంధి నీకే లాభకరం. యుద్ధంలో నీ కొడుకులు ఓడినా, పాండవులు ఓడినా నీకు ఏం సుఖం ఉంటుంది? యుద్ధం జరిగితే ప్రపంచంలో గల రాజులందరూ అందులో పాల్గొని అందరూ చచ్చిపోతారు. అందుచేత ఈ ప్రపంచాన్ని కాపాడటం నీ చేతిలో ఉన్నది. ఇక్కడ చేరిన రాజులందరూ సంతోషంగా సహపంక్తి భోజనాలు చేసి, ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిపోయేటట్టు చూడు. పాండవులకు నీ కన్న పెద్ద దిక్కెవరు? కష్ట సమయంలో నువు ఆదుకోకపోతే వారికి ఎవరున్నారు? ఆ మాటే వారు నీతో చెప్పమన్నారు. ఈ సభలో ఉన్న వారితో వారు మరొకమాట చెప్పమన్నారు: ఏ సభలో అధర్మ నిర్ణయం జరుగుతుందో ఆ అధర్మం వల్ల కలిగిన పాపం సభలోని వారికందరికీ చుట్టుకుంటుంది. అందుచేత సభికులు ధర్మాన్నీ, న్యాయాన్నీ చెప్పటం వారి విధి. నేను బాగా ఆలోచించి చెబుతున్నాను. ఈ రాజులందరినీ మృత్యువు నుంచి కాపాడు. పాండవులకు న్యాయంగా వారి తండ్రి భాగం ఇయ్యి. ధర్మరాజు ఎలాటి వాడో నీకు తెలుసు. లక్క ఇల్లు కాల్చినా అతను తిరిగి నీ వద్దకే వచ్చాడు. నువు అతన్ని ఇంద్రప్రస్థానికి తోలితే మారు మాటాడక వెళ్ళాడు. శకుని మాయతో నీ కొడుకు తన సర్వస్వమూ కాజేసినా ధర్మరాజు సహించాడు. నేను మీ క్షేమమూ పాండవుల క్షేమమూ కోరి చెబుతున్నాను, నీ కొడుకులను నిగ్రహించు. పాండవులు నీకు సేవ చెయ్యటానికైనా, యుద్ధం చెయ్యటానికైనా సిద్ధంగానే ఉన్నారు. కనక నీకు ఏది మంచిదని తోస్తే అది చెయ్యి."

కృష్ణుడు మాట్లాడటం పూర్తి చేసిన తరవాత అందరూ మౌనంగా ఉండిపోయారు. ఎవరుగాని అతనికి ఎలాటి సమాధానం గాని చెప్పక పోవటం అందరికీ ఆశ్చర్యంగా తోచింది.

అప్పుడు పరశురాముడు ధృతరాష్ట్రుడితో, "రాజా, నీకు ఒక నీతితో కూడిన సంగతి

చెబుతాను. అది నీకు నచ్చినట్టయితే దాని ప్రకారం నడుచుకో," అంటూ ఇలాచెప్పాడు:

పూర్వం దంభోద్భవు డనే రాజు ఉండే వాడు. అతను ప్రతి ఉదయమూ నాలుగు వర్ణాల వారినీ పిలిపించి, "మీలో ఎవరైనా నన్ను జయించగలరా?" అని అడిగేవాడు. అలాటి ఆత్మశ్లాఘం కూడదని బ్రాహ్మణులు సలహా ఇచ్చినప్పటికీ ఆ రాజు తన అల వాటు మానలేదు.

చివరకు బ్రాహ్మణులు ఆ రాజుతో విసిగి పోయి, "రాజా, నరనారాయణులని ఇద్దరు ఋషులున్నారు. వారిద్దరే ఎంతమందినైనా జయించగలరు. వారు గంధమాదనపర్వతం మీద తపస్సు చేసుకుంటూ ఉంటారు. యుద్ధం చెయ్యాలని ఉత్సాహం ఉంటే వారి వద్దకు వెళ్ళు," అన్నారు.

దంభోద్భవుడు తన సేనలను వెంట బెట్టుకుని నరనారాయణులు తపస్సు చేసు కునే చోటికి వెళ్ళి, వారు ఆతిథ్యం ఇయ్య బోతే తనకు యుద్ధంతో ఆతిథ్యం కావా లన్నాడు. అది యుద్ధాలు చేసే ప్రదేశం కాదని వారు చెప్పినా అతను వినిపించు కోలేదు. అప్పుడు నరుడనే ఋషి అలిగి, ఇన్ని దర్భలు మంత్రించి రాజు మీదా, అతని సేన మీదా వేశాడు. ఆ దర్భాస్త్రానికి దంభో ద్భవుడూ, అతని సేనలూ దిగ్భ్రమ చెంది పోయాయి. దంభోద్భవుడు నరుడి కాళ్ళపై బడి క్షమాపణ చెప్పుకున్నాడు.

"నువు నీ ప్రగల్భాలు మాని ప్రజారంజ కంగా రాజ్యం పాలించుకో," అని నరనారా యణులు దంభోద్భవుణ్ణి పంపేశారు.

పరశురాముడు ఈ కథ చెప్పి, "ధృత రాష్ట్రా, నరుడు మాత్రమే ఇంత పని చెయ్య గలిగాడు. నారాయణుడు నరుడి కన్న కూడా అధికుడు. ఆ నరనారాయణులే అర్జునుడూ, కృష్ణుడూనూ. అందుచేత అర్జు నుడు గాండీవం ఎక్కుపెట్టక ముందే దురభిమానం అవతల పెట్టి అతన్ని శరణు వేడుకో. కృష్ణుడు తోడైన అర్జునుణ్ణి యుద్ధ రంగంలో సహించటం అసాధ్యం. యుద్ధం మాట కట్టిపెట్టి పాండవులతో సంధి చేసుకో," అన్నాడు.






౫

హిమాచలాన్ని అనుకొని ఉన్నతమైన దేవ దారు వృక్షాలతో హిమానీ జలపాతాలతో ఎంతో రమణీయంగా ఉండే దారుకావనంలో ఒకప్పుడు భృగువు, మరీచి, అంగీరసుడు మొదలైన హేమాహేమీలైన మహాఋషులు ఆశ్రమాలు వేసుకొని గొప్ప తపస్సులు, యాగాలు చేస్తూ తమ భార్యలతో కాపుర ముంటూండేవారు.

ఆ ఋషుల తపోమహిమ చేతనే అతి లోక సౌందర్యవతులైన వారి భార్యలు మహా పతివ్రతలై ఉంటున్నారనీ, పరపురుషులు వారిని సమీపించితే భస్మమైపోతారనీ, ముమ్మూర్తులైనా తమ తపశ్శక్తి ముందు ఆగలేరనీ, తపోగర్వంతో ఆ ఋషులు పెద్ద కబుర్లు చెబుతూండేవారు. ఈ సంగతిని నారదుడు కైలాసం వెళ్లి పార్వతీశివుల చెవిని వేశాడు.

ఇలా ఉండగా ఒక మహా యజ్ఞాన్ని జరి పించేందుకని ఇళ్ళ వద్ద భార్యలను వదిలి ఋషులందరూ కలిసి తరలి వెళ్ళారు. ఆ తరుణం చూసి శివుడు సమ్మోహనా కారుడై ఒక చేత గంజాయి, విప్పపూల సురా పాత్రనూ మరో చేత భిక్షాపాత్రనూ పట్టుకొని ఉన్మత్తునిలాగ తూలుతూ భిక్షాటనం ప్రారంభించాడు. ఋషిపత్నులు అతణ్ణి చూసి పరవశించి వెంటబడి అతనితో బాటు ఆడుతూ పాడుతూ దారుకావనమంతా విహరించసాగారు.

యజ్ఞవాటికలో ఉన్న ఋషుల దగ్గిరికి నారదుడు వెళ్ళి, "అవతల మీ కాపరాల్ని భిక్షువొకడు కూలుస్తున్నాడు!" అని చల్లగా చెప్పి జారుకున్నాడు.

ఋషులు హుటాహుటిని దారుకావనానికి పరిగెత్తిపోయి, తారల మధ్య చంద్రుడిలా

అట్ట చివరి బొమ్మ

ఉన్న శివుణ్ణి, "ఎవ్వడవురా నీవు?" అని గద్దించారు.

"నా పేరు చిదంబర సుందరేశ్వరుడు!" అన్నాడు భిక్షువు.

"నీవు చేసే పనేమిటి?" అన్నారు ఋషులు.

జవాబుగా సురాపాత్రనూ, భిక్షాపాత్రనూ ఎత్తి చూపిస్తూ, "పనిలేని వారికి ఏదో పని కల్పించడమే నా పని!" అన్నాడు శివుడు.

"ఓరీ! నీ మగతనం బూడిదపాలై శిల అగుగాక!" అని శపించారు ఋషులు.

"నా కదేమీ కొత్త కాదు!" అంటూ శివుడు పరిహాసం చేశాడు.

ఋషులు అభిచార హోమం చేసి హోమకుండం నుంచి 'మాయ' అనే కారు చీకట్లుక్రమ్మే కృత్యాభూతాన్ని పుట్టించి శివుడి మీదకు పంపారు.

శివుడు ఆ మాయను తన కుడికాలు క్రింద అణిచి ఎడమ కాలు ఎత్తి చిందులు త్రొక్కడం మొదలు పెట్టాడు.

ఋషులు 'భయం' అనే పెద్దపులిని హోమకుండం నుంచి రప్పించి శివుడి మీదకు వదిలారు. శివుడు దాన్ని చీల్చి పులిచర్మాన్ని మొలకు చుట్టుకున్నాడు.

'మహాపాపములు' అనే విషసర్పాల్ని శివుడి మీదకు విసిరారు ఋషులు. శివుడు ఆ పాములను భూషణాలుగా ధరించాడు.

ఋషులు 'చిత్తచాంచల్యం' అనే సమ్మోహన విద్యను మంత్రోచ్చాటన చేస్తూ ప్రయోగించారు.



శివుడు దాన్ని చిన్న లేడి పిల్లగా చేసి పిడికిట బిగించి పట్టుకున్నాడు.

ఋషులు ప్రళయాగ్నిని రగిల్చి శివుడి మీదికి విశిరారు.

శివుడా అగ్నిని పూల చెండులా పట్టుకున్నాడు.

అప్పటికీ ఋషులు శివుణ్ణి తెలుసుకోలేక మహాజ్వాలలను విశిరారు.

ఆ జ్వాలలు శివుడి చుట్టూరా వలయాకారంతో తోరణం కట్టాయి.

మాయను మర్దిస్తూ, నటరాజ శివుడు చేస్తున్న నృత్యాన్ని చూడ్డానికి విఘ్నేశ్వరుడు, కుమారస్వామి, నంది, భృంగి మొదలైన ప్రమథగణాలు వెంటరాగా పార్వతి వచ్చింది. జగదాంబ ముందట శివుడు మహానందంతో తాండవం చేస్తూంటే దేవతలంతా వచ్చారు.

రాగబద్ధంగా విష్ణువు మృదంగం వాయిస్తూంటే సరస్వతి వీణ మీటగా ఇంద్రుడు వేణువు నూదాడు. బ్రహ్మ తాళాలు పట్టి లయవేశాడు. ఋషులు బుద్ధి తెచ్చుకుని సామవేదాన్ని పల్లిస్తూంటే, నారదుడు దేవగాంధారగానం చేశాడు. భృంగీశ్వరుడు ఢమరుకాన్ని, నందీశ్వరుడు భేరిని వాయించారు. కుమారస్వామి తూర్యనాదాన్ని పూరించాడు. శివతాండవం చూస్తూంటే విఘ్నేశ్వరుడికి ఉత్సాహం పుట్టుకొచ్చి నృత్యం చేయడం మొదలు పెట్టాడు. అతని వాహనం చిట్టెలుక కూడా చిందులు వేసింది.



నృత్యశివుడు, రాగవిష్ణువు లయబ్రహ్మగా జగల్లీలా నృత్యంగా శివలీల సాగుతూంటే ఆ నృత్యాన్ని చూసి భరతముని నటరాజ శివుణ్ణి నాట్యానికి అధిదేవతగా భరతశాస్త్ర మనే నాట్యవేదాన్ని రచించాడు.

వ్యాఘ్రపాదు డనే మునికి ఉపమన్యువు అనే కొడుకు ఉండేవాడు. అయిదేళ్ళ ప్రాయంలోనే ఆ కుర్రవాడికి తాము దరిద్రు లన్న సంగతి తెలిసి వచ్చింది. వాడు అర ణ్యానికి పోయి పంచాక్షరీ మంత్రం జపిస్తూ శివుణ్ణి గురించి తపస్సు చేశాడు.

శివపార్వతులు వికార రూపాలలో ఉపమన్యువు ఎదటికి వచ్చి, "బాబూ, ఈ అరణ్యంలో పులులుంటాయి. ఇంటికి వెళ్ళు," అన్నారు.

"శివ పంచాక్షరీ ఉండగా నాకు ఏ భయమూ లేదు," అన్నాడు ఉపమన్యువు.

పార్వతీపరమేశ్వరులు సంతోషించి అత నికి అష్టఐశ్వర్యాలు ఇచ్చారు.

గయాసురు డనే దానవుడు ముల్లోకాలు ఆక్రమించి కైలాసం మీదకు కూడా విరు చుకు పడ్డాడు. శివుడు తన జటాజూటాన్ని విదిలించగా అందుండి భయంకరమైన ముఖంతో పెద్ద శరీరంతో ఒక ఘోరాకారుడు దానవుణ్ణి కబళించడానికి ఉరికాడు. గయుడు భయంతో గజగజ వణికిపోతూ శివుణ్ణి శరణు వేడుకొన్నాడు. శివుడు అభయ మిచ్చాడు.

భయంకరముఖుడు చేసేది లేక "ఆహారం! ఆహారం కావాలి!" అని ఆక్రో శించాడు. "నీ శరీరాన్నే నీవు తిని నీ ఆకలి చల్లార్చుకోవలసిందే!" అని శివుడు ఆదే శించాడు. శివాజ్ఞను శిరసావహించి భయం కరముఖుడు తన శరీరాన్నంతటినీ భక్షించి ముఖంతో మిగిలాడు. అప్పుడు శివుడు ప్రీతుడై ఆ ముఖానికి "కీర్తి ముఖము" అని పేరుపెట్టాడు. "ఓయీ, కీర్తిముఖుడా! నీవు అందరి దేవతల తలలపై నిలిచి వారికి కీర్తి కలుగజేస్తుంటావు" అని వరమిచ్చాడు.

ఆ విధంగా శివుని అంశ కీర్తిముఖంగా మకరతోరణం మధ్య ప్రతి దేవతామూర్తి నడినెత్తిన ప్రకాశించింది.



# 135. నవచ్ఛత్రం

ఫ్నోమ్‌పెన్ (కాంబోడియా) రాజభవనంలో గల ఈ సింహాసనంపై తొమ్మిది గొడుగులు ఉన్నవి. కాంబోడియా రాజులకు రాజ్యాభిషేకం ఇక్కడే జరిగేది. విదేశరాయబారులు రాజును ఇక్కడే కలుసుకునేవారు. ఈ సింహాసనం ఎదటికి స్త్రీలు రాకూడదు. రాజును స్త్రీలు చూడటానికి దీని వెనక మరొక గది ఉండేది.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

వాలుచూపులతో

పంపినవారు :
ఎం. సునీత

Photo by P. Anant Desai



కొవ్వూరు.
(పశ్చిమ గోదావరి జిల్లా.)

గాలం వేసేను

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు మార్చి నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మే నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



శ్రీరామనవమి వేడుకలు :

రెండవ అట్ట : హనుమంతుడు

మూడవ అట్ట : రాక్షసులు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26



# అధిక పుష్టినిచ్చే బ్రిటా బిస్కట్లు తక్కువ ధరకు ఎక్కువ బిస్కట్లు




బ్రిటానియా బ్రిటా బిస్కట్ల నిండుగా పిల్లలకు పుష్టినిచ్చే పదార్థాలున్నాయి. అవి ఎంతో పసందుగా కూడా వుంటాయి. ఈ చిన్నచిన్న బిస్కట్లను మీరెంతో ప్రీతితో తినగలరు. పైగా తక్కువ ధరకే ఎక్కువ బిస్కట్లు లభిస్తాయి.

భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు బ్రిటానియా

BBC-2768

# జామెట్రీ సులభతరం
# జాగ్రఫీ సుందరతరం చేసుకోండి...

పైథాగరస్‌ను బాగా అభ్యసించండి, మ్యాప్ డ్రాయింగుకు రంగులు దిద్దండి....కేమ్లిన్ ఇన్‌స్ట్రుమెంటు బాక్సును, రంగు పెన్సిళ్లను ఉపయోగించండి. ఒకటి ఉపయోగంలో ఖచ్చితమైనది, చూడ ముచ్చటైనది; రెండవది మెత్తగా సాఫీగా వ్రాస్తుంది—రెండూ చాలా కాలం మన్నుతాయి, పాడై పోకుండా ఉంటాయి. పొదుపైనవి కూడా.

అనేక రకాల ఆర్ట్ సామగ్రి, మీకు పనికి వచ్చేవి కూడా, కేమ్లిన్ వద్ద లభిస్తాయి—వేక్స్ క్రేయాన్లు, వాటర్ కలర్సు, పోస్టర్ కలర్సు—ఇంకా ఎన్నో. వాటి కోసం మీకు దగ్గరలో నున్న దుకాణంలో అడగండి.




# కేమ్లిన్

రంగు పెన్సిళ్లను, ఇన్‌స్ట్రుమెంటు బాక్సును ఉపయోగించండి.






కేంమ్లిన్ ప్రైవేట్
లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్,
జె. బి. నగర్, బొంబాయి-59,
(ఇండియా)

PRATIBHA 1813-39 TEL

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2 | *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | : | B. V. REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Prasad Process Private Ltd.,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. | *Publisher's Name* | : | B. VISWANATHA REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Chandamama Publications,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. | *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | 'Chandamama Buildings'<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. | *Name & Address of individuals who own the paper* | : | Chandamama Publications<br>PARTNERS:<br>1. Sri B. Nagi Reddi,<br>2. Smt. B. Padmavathi,<br>3. Smt. B. Bharathi,<br>4. Sri B. V. Sanjaya Reddi (Minor),<br>5. Sri B. N. Suresh Reddi ( ,, ),<br>6. Sri B. V. Satish Reddi ( ,, ) |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

B. VISWANATHA REDDI
*Signature of the Publisher*

*1st March* 1973

